# వసంత రాజీయం




## ఓగేటి ఇందిరాదేవి



పూర్ణిమా బుక్ హౌస్
కాంగ్రెస్ ఆఫీసు రోడ్
గవర్నరుపేట, విజయవాడ-2.

# ముందుమాట

శ్రీమతి ఇందిరాదేవి రాసిన ఈ కథల సంపుటి 'వసంతరాజీయం' చదివి నేను ఎంతో ఆనందించా. కథలన్నీ సంసార పక్షంగా నడవడంతో సంతోషించాను. ఈ మధ్య కాలంలో ఇలాంటి కథలు అరుదుగా ప్రచురణ కావడం వల్ల ఎంతో ఉత్సాహంగా ఈ కథల్ని చదవగలిగాను.

నా ఉద్దేశంలో కథలు రెండు రకాలనుకుంటాను. ఒకటి కత్తీ కథ. రెండు తెలుగు కథ. పరభాషా ప్రభావంతో కొంత మషాళా కలిపి వండే కథకత్తీ కథ అనీ కేవలం (తెలుగు కథని తెలుగు తనంతోనే రాయబడే కథ తెలుగు కథ అనీ నేను భావిస్తాను ఈ రెండు జాతుల్లోనూ నేను తెలుగు కథకే నా వోటు వేస్తాను.

ఈ పుస్తకంలో ఇందిరాదేవి గారు అన్నీ తెలుగు కథలే రాయడం శ్లాఘనీయం. ఈ కథల సంపుటికి నేను ముందు మాటలు చెప్పడం నా అదృష్టం.

"స్వర్గానికి వెళ్ళినా..." అనే కథ నాకు బాగా నచ్చింది. తెలుగు చమత్కారం యొక్క ప్రత్యేకతని సంతరించుకున్న కథ యిది. అనుభవం లేనిదే ఈ చమత్కారం సృష్టించడం కష్టం. ఇందిరాదేవి గారికి అలాంటి అనుభవమేదో వుండి వుంటుందని నా డవుటు.

ఉపాధ్యాయ వృత్తిలో వున్న ఈ రచయిత్రి తన విద్యార్థులను ఏ విధంగా తీర్చిదిద్దగలదో "విజయోస్తు" కథ ద్వారా ఊహించ గలిగాను. ఆ కథలో చెప్పిన విషయమూ ఆ శిల్పమూ నన్ను బాగా ఆకర్షించాయి.

"రాగమాలిక" ఒక నాలుగు స్తంభాలాట. ప్రేమించడం ఆ ప్రేమించిన వారినే పెళ్ళి చేసుకోవడం ఎక్కడోగాని జరగదు. ఎవర్నో ప్రేమిస్తాం. మరెవర్నో పెళ్ళి చేసుకుంటాం. ప్రేమా పెళ్ళీ అనే రెండు అంశాలూ బతుకుబాటలో రెండు మజిలీలు. దేని ప్రాముఖ్యత దానికుంటుంది. ఒక మజిలీలో వుంటూ మరో మజిలీ గురించి ఆలోచిస్తూ ఆరోగ్యం పాడు చేసుకోడం అవివేకం. పరిస్థితులకు రాజీపడి బ్రతుకు పండించుకోడం ఉత్తమమైన మార్గం. ఈ సూక్తి వేదవాక్కు లాంటిది. రచయిత్రి ఈ కథని బాగా మలిచారు.

ఆ మాటకొస్తే ఈ పుస్తకంలో ప్రచురించిన కథలన్నీ ప్రశంసనీయంగానే వున్నాయి. ప్రతి కథా చదవతగ్గ కథే. ఇన్ని మంచి తెలుగు కథలు అందించిన రచయిత్రిని నేను మనసారా అభినందిస్తున్నాను.

హైదరాబాదు, ఆదివిష్ణు

తేదీ 29-8-1988.

# కృతజ్ఞతలు

ఇందులోని కథలు తమ తమ పత్రికలలో ప్రచురించిన పత్రికాధిపతులకీ

అడగంగానే-అతికష్టంమీద తీరిక చేసుకుని అమిత వాత్సల్యంతో 'ముందు మాట' వ్రాసి యిచ్చిన శ్రీ ఆదివిష్ణు గారికీ,

ఈ పుస్తకం ప్రచురణకి అర్హమైనదిగా ఎంచి 2 వేల రూపాయల ఆర్థిక సహాయంచేసిన తెలుగు విశ్వవిద్యాలయంవారికీ

ఈ పుస్తక ప్రచురణ భారాన్ని పూర్తిగా తన తలపై వేసుకొని నిర్వహించిన శ్రీ ఉన్నవ రామమోహనరావుగారికీ (Telugu Department-Govt. Degree College-Khairatabad)

దీనిని ప్రచురించి యిచ్చిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారికీ

శ్రీ కె. యల్. నరసింహారావుగారి ఆధిపత్యంలోవున్న, మాసిటీ కాలేజీ తెలుగు విభాగానికీ

ఇంకా

అనేక విధాల ప్రోత్సహించిన శ్రేయోభిలాషులకూ-

స్నేహితురాళ్ళకూ

డాక్టరు రుక్మిణీ సురేంద్రరావు దంపతులకి

అమూల్యమైన ముఖచిత్రం గీసియిచ్చిన శ్రీ జి. యస్. రావు (Boys High School గన్నవరం) గారికీ. నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

రచయిత్రి

# అంకితం

డా॥ శ్రీ మధుసూదన జోషి గారికి, డా॥ నందూరి శివప్రశాంత్ గారికి నమస్సుమాంజలులతో 'వసంత రాజీయాన్ని' అంకితమిస్తున్నాను.

—రచయిత్రి

# విషయ సూచిక

# రాగమాలిక

రాత్రి పదిగంటలు దాటింది.

"తలుపుతీయ్-ప్రభా:" తూలుతూ తలుపనుకొని గోడమీద బాదుతున్నాడు మురళీ మోహన్.

తలుపుతీసి భర్తను పట్టుకుని నడిపించబోయింది ప్రభ. "ఏయ్: లోపలికి తీసుకెళ్ళమంటే బయటికి తీసుకువెళ్తావేం? అంత తెలీకుండా తప్పతాగి వచ్చాననుకున్నావా ఫూల్" అంటూ చెంపన చెళ్ళున కొట్టాడతను.

"లోపలికే తీసుకెళ్తున్నానండి ఎవరన్నాచూస్తే బాగుండదు. తొందరగా రండి" అంటూ గుడ్లనీరు గుడ్లకుక్కుకుంటూ నడిపించుకెళ్ళిందామె బలవంతంగా.

"ఏం చూస్తే నన్నెవరే అనేది..." అంటూ అతడు తిడుతున్న బూతులు లీలగా విన్పిస్తూనేవున్నై

ఆ "ఎవరన్నా" పేరు ఆనందవల్లి.

పక్కింటికిటికిలోంచి చూస్తూ గిజగిజలాడిపోయింది.

"ఆఁనా పూజ అయింది ఇంక వడ్డిస్తావా?" అని లోపల్నించి భర్త యజ్ఞనారాయణ కేకెయ్యడంతో వంటింట్లోకి నడిచింది.

ఎవరింట్లోనో పీఠాధిపతికి పాదపూజ జరుగుతుంటే చూడటానికి

వెళ్ళి వచ్చేప్పటికి పొద్దుపోయిందతనికి. ఎంత రాత్రయినా అనుష్ఠానం మటుకు మానడు యజ్ఞనారాయణ.

"ఓం సత్యం త్వర్తేన పరిషించ్యామి. అమృతమస్తు" అంటూ ఔపోసన పడుతున్న వాడు కాస్తా ఆగి, అలా వున్నావేం ఆనందా? అని అడిగాడు.

"నేనా" అని శుష్కంగా నవ్వింది ఆమె.

ఇంక అతనూ రెట్టించలేదు.

భోజనం కాగానే తమలపాకు చిలకలు అందించబోయింది ఆనంద.

అతను చప్పున చేత్తో అందుకున్నాడు.

ఆమె మనస్సు నిండా వాడిన మల్లెలాంటి ఊహలు తను చేతికి అందించబోవటం 'అతను' మారాంచేస్తూనోరు పట్టటం, తన చెక్కిళ్ళపై కోటి సిగ్గులు- అతని కళ్ళల్లో శతకోటి మెరుపులు-

"ఇవాళ ఏదో ఆలోచనలో మునిగి పోయినావుకదు ఆనందా; సరే నిన్ను డిస్టర్బ్ చెయ్యటమెందుకు. నేను పడుకుంటున్నా" అంటూ తన మంచంమీద తూర్పుముఖంగా కూచుని నారాయణకవచం చదువుకోవటం మొదలుపెట్టాడు యజ్ఞనారాయణ.

ఆమె మనసులో పునరావృతమై మంటలు రేకెత్తిస్తున్నై. ఊహలు రమ్యంగా అలంకరించబడిన తన పడక గదిలో ఒక్కటే ఒక్క చక్కని మంచం. మనోహరమైన వాతావరణంలో పరువాలు సంపాదించి తొందర చేస్తుంటే- ఒహ్-అలకలు బ్రతిమిలాటలూ బిగికౌగిళ్ళు, సరదాలూ, తమా

# 3

షాలూ...అవన్నీ ఏమైపోయినై? హుఁ అవి కసిగా నిట్టూర్చింది. కన్నీటితో దిండు తడిసిపోయింది.

పక్కింట్లో.

"ఏయ్! దొంగా తప్పించుకొచ్చేసావా!" అంటూ చాపమీద పడుకున్న ప్రభును లేపేసాడు మురళీమోహన్.

'మీరు మంచం మీదికెళ్ళి పడుకోండి, ప్లీజ్" బతిమాలిందతన్ని.

"ఊహుఁ నువ్వెక్కడుంటే నేనూ అక్కడే..."

ఆమెకి వెలపరం పుట్టుకొచ్చింది.

అతను ఇంటికొచ్చి వాంతిచేసుకోవటం గుర్తుకొచ్చింది. ఆవాసనా, ఎఱ్ఱటి కళ్ళూ రేగిన జుట్టూ ప్చ్... ముద్దు మాటలతో కాసేపు ప్రేమ ఒలకబొయ్యటం మళ్ళీ అంతలోనే తిట్టడం కొట్టడం- మళ్ళీ లాలించటం హు ఎంత అసహ్యమైన పరిస్థితి.

తనెలాంటిది? తను పుట్టిన కుటుంబం ఎలాంటిది. తన ఉద్దేశాలు ఆదర్శాలు ఎలాంటివి. నిరాడంబరంగా నిర్మలంగా గడుపుదామని అల్లాడిన జీవితం ఈమోహజాలంలో, ఈ కృత్రిమ వాతావరణంలో, దుష్ట సాహచర్యంలో పడిపోయిందేమిటి? బూడిదలో పన్నీరు పోసిన దేవుడెంత నిర్దయుడు. పురోడాశం కుక్కముట్టుకున్నట్టే అయిందే భగవంతుడా!

అతనా చాపమీదనే పడి నిద్రపోతున్నాడు. సరిగ్గా పడుకోబెట్టి దుప్పటికప్పి ఇవతలి గదిలోకొచ్చి పడుకుంది. "వచ్చేశావా నువ్వూ" అని యధాప్రకారంగా ఆగదిగోడలు నిట్టూర్చినై.

జరీపూలు కుట్టిన చిలకపచ్చరంగు ఫారెన్ నైలాన్ చీర కట్టుకుని

పచ్చల నెక్లెస్ పెట్టుకొని అప్టుడేట్‌గా తయారై భర్తతో కలిసి ఎక్కడికో వెళ్తున్న ప్రభనుకన్నార్పకుండా చూసింది ఆనంద చాటుగా గుమ్మంలో నిలబడి.

ఆమె పక్కన అతను... ఖరీదైన డ్రెస్‌లో నిగనిగలాడే బూట్లతో నవమన్మథుడేమో అన్నట్లు ట్రిమ్‌గా తయారై వెళుతున్నాడు.

"అయ్యో: ఇలా ఇలా ఎందుకు జరిగింది....?"

"ఆంజనేయ స్వామి గుళ్ళో స్వామీజీ మీటింగుంది. నేనువెళ్తున్నా-నాకోసం చూడకు. నువ్వు అన్నం తినేసి పడుకో" అని చెప్పి వెళ్ళాడు యజ్ఞనారాయణ.

పల్చగా విభూదిరేఖలతో క్రాపులో కన్పించీ కన్పించకుండావున్న పిలకతో అక్షింతల బొట్టుతో, పంచెలాల్చీవేసుకుని, ఆకు చెప్పులు తొడుక్కుని వెళ్తున్న భర్తనూ, ఫుల్‌సూట్‌లో నుదుటిమీదపడి అల్లరిచేసే ఉంగరాల జుట్టుతో సైడ్‌లాక్స్‌తో ఉన్న అతన్నీ ఆమె మనసులో పక్క-పక్కన నిలబెట్టి మార్చిమార్చి చూసింది. దీర్ఘదీర్ఘంగా నిట్టూర్చింది...

'మీరేనా ఆనందవల్లి'.

అని అడుగుతున్న అందమైన యువకుణ్ణి ఆశ్చర్యంగా చూసింది ఆనంద.

"రిక్షాలో బుక్స్ వదిలేసి వెళ్ళారు." అంటూ అందించాడు తను. ఆమె నివ్వెర పాటుకి చిన్నగా నవ్వుతూ-

"చాలా చాలా థాంక్సండీ- ఈ బుక్స్ మళ్ళీ దొరుకుతాయనుకోలేదు. నా అదృష్టం కొద్దీ మీ కళ్ళ బడినై. ఇంకోరైతే తెద్దురో తేరో? బుక్స్‌మీద పేరూ సెక్షనూ కాలేజీ రాయడం మంచిదే అయింది-" అని తనివితీరా పుస్తకాల వంక చూసుకుంది ఆనంద.

# 5

ఒకానొక పెద్ద ఆఫీసులో చిన్న క్లర్కు సోమసుందరం. అయిదు గురు పిల్లల్లోకి పెద్దపిల్ల అయిన ఆనందవల్లిని పట్టుదలతో కాలేజీలో బిఎస్సీలో చేర్పించాడాయన. అందుకు తగినట్టు ఆ పిల్ల కూడా చక్కగా చదువుకుంటుంది. బుద్ధిమంతురాలని పేరు తెచ్చుకుంది. మ్యూజిక్ కాలేజీలో చేరి డిప్లొమా కూడా తెచ్చుకుంది. అప్పుడప్పుడు రేడియోలో పాడి చిన్న చిన్న సాయాలు చేస్తుంటుంది తండ్రికి ఆర్థికంగా. ఒకరోజు ఏదో సభలో ప్రార్థన గేయాన్ని పాడింది. ఇంటికి వచ్చేస్తుంటే అతను కన్పించాడూ యాదృచ్ఛికంగా.

"చాలా బాగా పాడేరండి ఇంకొంచెం కృషి చేస్తే మీరు..." అంటుంటే.

"రిక్షా కావాలమ్మా" అంటూవచ్చాడు రిక్షాఅతను తనమాటకు. అడ్డువచ్చినందుకు కోపంగా చూసి "అక్కర్లేదు" అన్నాడు.

"అదేమిటి" అని బిత్తరపోయిందామె.

"మీరు నాకార్లో వస్తున్నారు గనక" అని మామూలుగా అని చప్పున రెండు చేతులూ జోడించి 'ప్లీజ్' అన్నాడు ప్రార్థిస్తున్నట్లు-

ఆమెకి నవ్వొచ్చింది.

ఆ నవ్వులో పూలజల్లులు కురిసి ఆ పూల పరిమళాలు కన్నె హృదయం నిండా గాఢంగా గాఢగాఢంగా ఆవరించినై.

పేరంటంగా పిలిస్తే వచ్చి సత్యనారాయణ వ్రతం చూస్తూ కూచుం దన్న మాటేగాని మనస్సు ఉగ్గబట్టుకోవడం కష్టమైపోతోంది ప్రభకి- గోచీపోసి మడికట్టుకున్న జరీచీరతో తలంటుకున్న జుట్టువదులుగా ముడి వేసుకుని చేమంతి పువ్వు తురుముకుని కాళ్ళకు పసుపు రాసుకుని నుదుట

గుండ్రని కుంకుమబొట్టు పెట్టుకొని భర్తపక్కన ఒద్దికగా కూచుని పూజచేస్తోంది ఆనందవల్లి.

"ఎంత అదృష్టవంతురాలు! అటువంటి భర్త ఎందరికి దొరికేను? ఎంత పూజచేసుకుంటేను?" అని నిట్టూర్చింది ప్రభ.

విశాలమై అనాచ్ఛాదితమైన వక్షస్థలంమీద జందెం కనిపిస్తుంటే జరీఅంచు ఉత్తరీయం నిండుగా కప్పుకుంటున్నాడతను. పళ్ళుగిట్ట కరుచుకున్నది ప్రభ ఎందుకిలా జరిగింది? అతని పక్కన ఆమె—?...

"ఏయ్ గుండూ!" అని అరిచింది ఆపిల్ల-హోమంచేస్తున్న ఎనిమిదేళ్ళ పిల్లవాడు అప్రయత్నంగా తలెత్తాడు.

"పీపు పగలాలా ఏమే నీకు? అట్లా పిలవొద్దని ఎన్నిసార్లు చెప్పాను" అని గద్దించిందామె తల్లి.

పిల్లవాడి బిక్కమొహంచూసి పెద్దలు ముద్దుగా నవ్వుకుని ఓదార్చారు. అతను మంత్రం స్పష్టంగా చెప్తుంటే ముగ్ధులైనారు.

ఆ పిల్లపేరు చంద్రప్రభ. ఆ పిల్లవాడి పేరు యజ్ఞనారాయణ దీక్షితులు వాళ్ళిద్దరివీ పక్కపక్క ఇళ్ళే కావడంతో వాళ్ళ స్నేహలత పెరిగి దట్టంగా అల్లుకుని విడదీయ రానంతటిదై పోయింది. ఎందుకంటే ఇద్దరి తల్లితండ్రులూ సదాచారం మీద పూర్వ పద్ధతుల మీద నమ్మకం గలవారే-అప్పట్లో వియ్యమందటానికి పెద్ద అభ్యంతరాలేం లేవుపైగా-

"సాయంత్రం పార్టీవుంది. నేను వచ్చేటప్పటికి రెడీ కావాలి రాణి" అన్నాడు మురళి.

ఆమెచేతిలో కాఫీ కప్పు వణికింది.

"పార్టీయా?"

"ఊఁ ఏం?"

"అట్లాంటివేనా?"

"అంటే"

"అంటేనా? ఆడామగా అనే విచక్షణ లేకుండా ఇది తినదగినది ఇది తినతగనిది అని లేకుండా..."

"నోర్ముయ్! నాఖర్మకాలి కట్టుకున్నా నిన్ను. ఇంత ఆఫీసరై వుండి అంత పల్లెటూరిదాన్ని చేసుకోవటమేమిటి లేకపోతే ఎంత మా అమ్మా నాన్నల వత్తిడి అయితే మటుకు? ఏమిటో ఆ నిర్వేదంలో తప్పని సరై 'ఊఁ' అన్నా ఒక్క సుఖంలేదుకదా నీతో. అసలు నువ్వు పెళ్ళెం దుకు చేసుకున్నావు, ఐహిక సుఖాలమీద అంత విరక్తేవుంటే సన్యాసం పుచ్చుకోక పోయినావా? నా ప్రాణం తియ్యకపోతే... ఛీ" అంటూ కాఫీ కప్పు కాలితో తన్నేసి వెళ్ళిపోయాడు మురళి.

సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చి అలసటగా సోఫాలో వాలి కళ్ళు మూసుకున్నాడు.

నుదుట చల్లని చెయ్యి పడటంతో కళ్ళువిప్పి చూశాడు.

ఆదుర్దాగా చూస్తున్నది ప్రభ-

అమాంతం ఆమెని దగ్గిరికి లాక్కోవాన్పించింది. కాని-

"అలా వున్నారేం? ఆఫీసులో వర్క్ ఎక్కువైనట్టుంది" అని

తనే ప్రశ్నవేసుకొని జవాబు చెప్పుకుంది.

"పోన్లే పార్టీకి రాకపోతే పోయినావు. నీకోసం చీరతెచ్చాను చూడు పొద్దున ఏదేదో వాగి నీ మనసుబాధ పెట్టినట్లున్నా ఏమనుకోవద్దు మరి" అన్నాడు-

# 8

"ఇప్పుడెందుకండి ఇంత ఖరీదు పెట్టి ఈ చీర?"

ఉసూరుమన్నాడతను.

"సరేగాని లేచి కొంచెం కాఫీతాగండి-"

తల అడ్డంగా ఊపాడు.

"ఏమిటండీ ఆ గారాబం?" చిన్నగా నవ్వింది.

"నన్ను కూచోపెట్టి తాగించాలి"

ఛీ- నేనా?"

అతని మొహం ఒక్క క్షణం మాడిపోయింది.

"నువ్వే-రేపొద్దున నీకో బుల్లి పాపాయిపుడితే తాగించవూ?"

"పోండి- ఏంమాటలవి" అంటూ ఆమె వచ్చి గుండెల్లో తలదాచుకుంటే తను, 'ఆమె' ముంగురులు సవరిస్తూ...

హఠాత్తుగా గంభీరంగా అయిపోయిన భార్య మొహంచూసి అతని ఊహల మనోహరం పుటుక్కున తెగిపోయింది. వెంటనే లేచి డ్రెస్ మార్చుకుని బయటికెళ్ళిపోయాడు.

చల్లారి పోయిన కాఫీవంక పిచ్చిదానిలా చూసింది ప్రభ...

"ఏమండి?"

తెల్లనిచీర కట్టుకుని మల్లెలు పెట్టుకుని మృదువుగా పిలిచినభార్యను చిత్రంగా చూశాడు యజ్ఞనారాయణ.

"మాట్లాడరేమిటండీ" అన్నది ఆనంద.

"ఏం మాట్లాడను? నిన్నిలా చూస్తుంటే నాకు మాటలేం వస్తాయి?" అంటూ చేతులుచాచి తన బాహుద్వయంలో బంధిస్తే-' అనుకుంటూ—

"ఈ చీర కొత్తది కదా అని చూస్తున్నా. ఇప్పుడు గడివిప్పా వెందుకు? ఏ పండక్కో కట్టుకుంటే పోయేదిగా-ఈ బడిపంతులుపండక్కి ఇంకోటి కొనమంటే కొనగలడా! నువ్వలా కోపం తెచ్చుకోకు నేననటం ఏమిటంటే"...

ఊహలకీ జీవితానికీ ఉన్నపొత్తు చూసి ఆక్రోశించిందామె హృదయం-ఇలా అన్నది.

"నాకు నా భర్త సన్నిధికంటే వేరే పండగలేదు. అసలు పండక్కి చీరకొనమని ఎప్పుడూ అననునేను. ఇవాళ మీరు ఏ సభకి వెళ్ళకుండా ఇంట్లోనే ఉన్నారు. అంతే చాలని కట్టుకున్నానండీ..."

"సరి! ఇవాళ ఏకాశి-ఇంక నీ మంచంమీద కెళ్ళిపడుకో" అంటూ సీతారామాంజనేయం చదువుకోవటంలో పడ్డాడు యజ్ఞనారాయణ.

"హుం ఎన్నాళ్ళిలా- ఏకాశనీ పౌర్ణమనీ అమావాస్యనీ సభలనీ సమావేశాలనీ నన్నెందుకిలా ఏడిపిస్తారు? మీకు నేనంటే బొత్తిగా ఇష్టం లేదని తెలుస్తూనేవుంది.

నేను తట్టుకోలేక పోతున్నా" అంటూ రెండు చేతుల్లో మొహం దాచుకుంది ఆనందవల్లి.

నవ్వలేక నవ్వాదతను పల్చగా-

"నేను మటుకు తట్టుకోగలుగుతున్నానా?" అనుకున్నాడు. అతని స్థితికి అతనికే ఏడుపొచ్చింది. ఇలాంటప్పుడు స్వాంతన లభించేది ఒకటే చోట, నిల్చున్నపళంగా వేణుగోపాలస్వామి గుడికి బయల్దేరాడు.

రుక్మిణీసహితుడైన స్వామివారికి అర్చన చేయించి ప్రసాదం తీసుకుని కళ్యాణమండపం దగ్గరకొచ్చి కూచున్నాడు.

మందం మందం మధురనినదె : వేణు మా పూరయతం

బృందం బృందారక భువిచార యంతం చరంతం

అని కళ్ళు మూసుకొని మృదుస్వరంతో ధ్యానం చేసుకున్నాడు.

"యజ్ఞా" అన్న అతిమధురమైన పిలుపు. అతని నరనరాల గిలిగింతలుపెట్టే పిలుపు విన్పించింది.

ప్రేమంతా కళ్ళల్లో నింపుకొని అతనలా మాట్లాడకుండా చూస్తుంటే గుండె తరుక్కు పోయిందామెకి-

"నా పేరు పలకటంకూడా ఇష్టం లేదాయజ్ఞా నీకు? అప్పుడు నాదేవివనీ నా రాణివనీ మన్నించేవాడివే-"

"ప్రభా"

"యజ్ఞా నిన్నిలా పక్క ఇంట్లోనే ఇంకొక స్త్రీతో కలిసివుంటుంటే చూసి భరించలేక పోతున్నా"

"తప్పు ప్రభా! నువ్విలా అనకూడదు."

"ఇంకెలా అనను! ఉన్ననిజం అది. ఇతరులతో చెప్పుకోవటానికి లేనేలేదు. నీతోనైనా చెప్పుకోవద్దా?

"నేనుమటుకు ఎవరితో చెప్పుకొనేది ప్రభా !"

"యజ్ఞా"

"ఔను. నిన్ను మర్చిపోలేక నా భార్యకన్యాయం చేయలేక నెనెలా అలమటించి పోతున్నానో భగవంతుడికి తెలుసు. ఏ పూజలవల్లా ఏ అనుష్ఠానాలవల్లా ఏ ఉపదేశాలవల్లా ఏ ధ్యానాలవల్లా ఏ వేదాంతంవల్లా నాకు శాంతికలగటంల్లేదు. ప్రభా! నువ్వొక్కదానివే నాకుశాంతికలిగించగలవు.

ఇందుకు నన్ను క్షమించు. పెళ్ళై సుఖంగా భర్తతో కాపురం చేసుకుకటున్న ఇల్లాలితో ఇలా మాట్లాడినందుకు-"

"నేను నా భర్తకి న్యాయం చేస్తున్నాననుకుంటున్నావా యజ్ఞా! నాక్షోభ మరీ ఘోరంగా వుంది. ఆ అలవాట్లూ ఆ మనిషీ-ఛ-ఇటువంటి మహోత్తమ పవిత్ర జీవితాన్ని కోరుకున్న నాకు ఈ జీవితం ఎంతదుర్భరంగా వుందో చెప్పలేను. ఆయన మనస్సు చాలామంచిది. అంతచెడ్డ అలవాట్లు ఎందుకు చేసుకున్నారో అన్పిస్తుంది. నాతో మంచిగా ఉండటానికే ప్రయత్నిస్తారు. కానినేను-నేనే నిన్ను మర్చిపోలేక పోతున్నా" కన్నీళ్ళు తుడుచుకుంది ప్రభ—

అతనామె వంక ఆవేదనగా చూశాడు.

"ఏమిటి యజ్ఞా! అలా చూస్తున్నావు-నాకు భయమేస్తున్నది?" అన్నదామె.

"మనవల్ల రెండు నిండు జీవితాలు అన్యాయంగా బలైపోతున్నాయే అని"

నువ్వెప్పుడూ అంతే-ముందు మనజీవితాలను గురించి ఆలోచించు. నీ అంత సమ్యక్ దృష్టి సమభావం నాకు లేకపోవచ్చు. నేను మామూలు మనిషిని"

"నన్నేం చెయ్యమంటావింతకీ?"

"నేను చెప్పింది వింటావా మరి?"

"ధర్మబద్ధం కూడా అయితే..."

"పిచ్చి యజ్ఞా! మానవత్వం ధర్మం ఇలాంటి పిచ్చులున్న మనిషి ఈ రోజుల్లో పుట్టడం ఆశ్చర్యమే. నా ఉద్దేశం చెప్తావిను. ధర్మమనేది దేశ

కాల పరిస్థితులవల్ల మారుతుంటుంది. జీవితానందాన్ని అన్యాయంగా బలి చేసుకోమని ఏశాస్త్రమూ చెప్పదు. చెప్పినా పాటించనక్కరలేదంటాను. అప్పుడు ద్రౌపదికి అయిదుగురు భర్తలులేరూ...?"

"ఏమిటి నువ్వంటున్నది?" చివాల్నలేచి నిలబడ్డాడతను - "పెద్ద వాళ్ళు మనల్ని విడదీసి మెడలువంచి వేరే పెళ్ళిచేశారు. నీ మనసు మార్చ గలరా! వాళ్ళ కిరాతకత్వానికి మనమెందుకు బలికావాలి. కొత్తదాంపత్యా నికి ఎడ్జెస్ట్ కాలేకపోయినాము. ఈ భిన్నధృవాలు కలవటం అసాధ్యం- అందుకే మనిద్దరం ఎక్కడైనా వెళ్ళిపోదాం-ఇవాళంతా ఆలోచించుకో. రేపు ఇదేవేళకి ఇక్కడికొస్తాను. సుముఖంగా జవాబు చెప్తావుకదూ-" అతన్ని విభ్రాంతిలో ముంచి ఆమె వెళ్ళిపోయింది.

అసలు అంత సాహసం ఎలా చేసిందో ఆమెకే తెలీదు. అతన్ని చూసిన ఆ ఆవేశంలో మనసులో కోరిక ఉప్పెనలా చెలియలికట్ట దాటింది. అది ఏళ్ళూ ఊళ్ళూ...మంచిదే...

పార్టీలో పూర్తిగా ఎంజాయ్ చెయ్యలేక పోయినాడుమురళీమోహన్. మధ్యలో ఇంటికొచ్చేశాడు.

"అమ్మగారు గుడికెళ్ళారు. తాళంచెవి నాకివ్వలేదు బాబూ?" అన్నాడు నౌకరు.

"పక్కింట్లో ఇచ్చిందేమో అడిగిరా" అన్నాడు మురళి. అతనికి తనగది తలుపులు వేసుకొని కరువుదీరా ఏడవాలనిపిస్తున్నది. బయట నిలబడటం అసాధ్యమైపోతున్నది.

"నేను...నేను ఆళ్ళింటి కెళ్ళలేనండి" అని నీళ్ళు నమిలాడు నౌకరు-

"ఏం"

నాను కొంచెం డిరింకు పుచ్చుకున్నానండి ... ఆ యమ్మగార్ని గాని ఆ అయ్యగార్నిగాని సూడాలంటే..."

నవ్వొంచ్చిందతనికి-

నేనుమాత్రం తక్కువ పుచ్చుకున్నానా నీకంటే ఉత్తముణ్ణా? ఈ రోజుల్లో అంత పవిత్రంగా ఉన్న ఆ మనషులెవరో చూద్దాం" అంటూ వెళ్ళి తలుపు తట్టాడు.

తలుపు తెరచిన వ్యక్తిని చూసి దిగ్భ్రాంతుడై పోయి చేతులు చాచాడు.

బిత్తరపోయింది ఆనంద-

చిన్నబోయిందతని మొహం...నన్ను, నీమురళిని మార్చిపోయావా ఆనందా మురళీమోహనాస్వామి' అంటూ కవ్వించేదానివే నా పాదాలపై పారిజాతాలుంచి నీతోపాటు ఆనంద మంతా దోచుకుపోయావు. నిన్ను మర్చిపోవాలని వ్యసనాలకి దాసుడనై పోయాను. సర్వనాశనమై పోవటానికే సిద్ధపడ్డాను. గుండెల్లో బడబాగ్ని మండుతుంటే బయటికి మటుకు నిశ్చలంగా కన్పించటానికి ఎంత అవస్థ పడుతున్నానో తెలుసా..."

"అ చక్కగా తెలుస్తున్నై మీ అవస్థా మీ వ్యసనాలూనూ. మీదగ్గరి నుంచికొట్టే ఆ వాసన చాలు ఒకప్పుడు నేను ప్రాణంకన్న మిన్నగా ఆరాధించిన మురళీమోహన్ ఇంతపిరికివాడా అంటూ కనుబొమ్మలు చిట్లించింది ఆనంద.

తలవంచుకున్నాడతను-

"మీకు నేనింకా గుర్తునానన్నమాట. ఇలా తాగి తందనాలాడి భవిష్యత్తూ ఆరోగ్యమూ పాడు చేసుకుంటే నేనుపొంగి పోతాననుకున్నారా చాల్చాలు నామీద ఏమాత్రం గౌరవభావమున్నా ఈ అలవాట్లు మానండి ప్లీజ్" అంటూ చేతులు జోడించింది. ఆనంద కంఠగతమైన దుఃఖాన్ని అదిమిపట్టి.

"ప్రయత్నిస్తాను కానీ మాట ఇవ్వలేను" నూతిలోంచి వచ్చి నట్లుంది అతని గొంతు నీరసంగా-

"పక్కింట్లోఉన్న నిన్ను చూడలేదంటే ఆశ్చర్యం వేస్తున్నది. ఈ మధ్యనే ఇక్కడికి వచ్చారు కదూ మీరు? పొద్దునపోయి ఏ రాత్రివేళో ఇంటికి వస్తావు అంచేత...?"

"ఔనుమరి. మీ భార్యను చూడటానికే కాలం సరిపోక పోతుంటే ఇహనన్నెక్కడ చూస్తారు? చాలా సహజంగా నవ్వాలని ప్రయత్నించింది.

"పిచ్చి ఆనందా! నా భార్య సంగతి తెలిస్తే నువ్విట్లా మాట్లాడవు. అదట్లా వుంచు. ఒకటడుగుతాను ఏమి అనుకోవుగద" అన్నాడతను జంకుగా

"మీరడిగితే కాదనగలనా మురళీమోహన్!" ఆర్ద్రంగా అన్నది కన్నీరు తుడుచుకుంటూ.

"భావి జీవితం గురించి మనం ఎన్ని కలలు కన్నాం మన శృంగారం గురించి ఎన్ని ఊహలల్లుకున్నాం ఎన్నిచెప్పినా ఒక్కసారి తాకనివ్వలేదు నువ్వు. ఇప్పుడు అడుగుతున్నా ఆనందా ప్లీజ్ ఒక్కసారి నీ కౌగిట్లో కరిగిపోని. ఇంకీజన్మకేం అక్కర్లేదు నాకు. నీ దివ్య పరిష్వంగంలో రేకెత్తిన పులకలను తల్చుకుంటూ జీవితమంతా గడపగలను.

నీ మురళికి ఈ ఒక్క వరమూ ఇవ్వవా?" ఏవీ నీ అధరాలు? ఈ మురళిపై మోహనరాగం పలకవా!" అంటూ ఆవేశంగా దగ్గరకొచ్చాడు.

వణికిపోయింది ఆనంద.

"మీరేం మాట్లాడుతున్నారో మీకు అర్థమౌతున్నట్టు లేదు. బొత్తిగా మత్తులో వున్నారు" అన్నది

అతని చెవికేం ఎక్కటం లేదు.

అలవికాని ఆత్రం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. "ఏమిటండీ! ఇది-వదలండి ముందు ఛ-ఛ-మీరింత నీచంగా బిహేవ్ చేస్తారా?" గిజగిజలాడిందామె- "నువ్వేన్ని అన్నా అనుగాని ఆనందా! ఈ ఒక్క సారికీ వదల్లేను. క్షమించు. అటు నీ జ్ఞాపకాలతోపాటు నా భార్యకూడా ఏడిపిస్తున్నది. ఇటు నువ్వుకూడా తిరస్కరిస్తే నేనేమైపోవాలి. చెప్పు! పెద్దల ధనదాహానికి అన్యాయంగా ఆహుతై పోతున్నాం మనం". ముద్దగా మాట్లాడుతున్నాడతను.

ఈడ్చి చెంపమీద కొట్టింది ఆనంద. చటుక్కున ఆమెను వదిలేశాడు మురళి. అప్పటికి స్పృహలోకి వచ్చాడతడు.

"దయచేసి ఈ చెంపమీద కూడా కొట్టవూ ఆనందా! కనీసం నా చెక్కిళ్ళనైనా నీ అరచేతుల స్పర్శతో ధన్యం కానీ" అన్నాడు బరువుగా.

బావురుమన్నది ఆనంద. ఇంకొకళ్ళతో పెళ్ళి నిశ్చయమైనప్పుడు ఎక్కడైనా మనిద్దరం వెళ్ళిపోదాం రమ్మని ఎంత బ్రతిమలాడినా విన్నారు కాదు" అని.

"సర్లే. అంత ధైర్యమే నాకు వుంటే...అప్పుడు"

"ఇప్పుడింతధైర్యం వుందన్నమాట."

"ఆనందా! దేవతలాంటి నీమీద అత్యాచారం చెయ్యబోయినా కదూ? ఆమైకంలో ఒళ్ళు తెలీలేదు. ఈరాక్షసుణ్ణి క్షమించగలవా?" అని ఆర్ద్రంగా అడుగుతూ ఆమెను ఆపాద మస్తకమూ కళ్ళునిండుగా చూసుకొని గబ గబా వెళ్ళిపోయినాడు మురళీమోహన్-

ఉబికివచ్చే కన్నీటిని తుడుచుకుంటోంది ఆనంద-యజ్ఞ నారాయణ రానేవచ్చాడు.

ఆమె కన్నీళ్ళు గమనించనట్లే "ఇంకా పడుకోలేదా ఆనందా!దా! ఇలా-నా దగ్గరికి పిచ్చీ! అలాభయపడతావేం? నేనేం భూతాన్నా. అపట్టిన భూతం వదిలిందిలే ఇంక భయంలేదు-ఇంకా దగ్గరికి రావోయ్" అంటూ గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు.

ఇందాకట్నుంచి జరిగినదంతా భర్తచూశాడేమోనని హడలిపో తున్న ఆనంద గుండెనుంచి కొండంత బరువు దిగిపోతుంది.

"ఏమిటమ్మాయ్ అలా అయిపోయినావు? ఈ జడపదార్థానికి నామీద ఇంతప్రేమ ఎలా కలిగిందబ్బా అనా! చెప్తాగాని ముందు ఈ పాతచీర విప్పేసి ఇందాక కట్టుకున్న ఆ తెల్లచీర కట్టుకురా" అంటూ హాయిగా నవ్వాడు యజ్ఞనారాయణ.

ఈ రోజు భర్త ఆఫీసు కెళ్ళలేదు. పైగా ఫ్రిజ్‌లో వున్న డ్రింక్ బాటిల్స్ తీసి పారేస్తున్నాడు. అయోమయంగావుంది ప్రభకి. ఇతని కన్ను గప్పి సాయంత్రం గుడికి వెళ్ళటమెలాగ? అన్న దడదడ ఏదో మొండి ధైర్యంతో అన్నదే గాని, తీరా ఇప్పుడు భయంవేస్తున్నది-

అంతలో నౌకరు వచ్చి "అమ్మా! ఈ కవరు మీ కిమ్మన్నారు పక్కింటి బాబుగారు అని ఒక కవరిచ్చి వెళ్లాడు.

గది తలుపు వేసుకొని వణికే చేతుల్తో విప్పింది. చి॥సౌ॥ చంద్ర ప్రభకి.

శుభాశీస్సులతో-

నెలరోజులు స్కూలుకి సెలవుపెట్టాను. తర్వాతఇంకో వూరికి ట్రాన్స్‌పర్- నేను ఎదురుగా లేకపోతేనైనాకాస్త ప్రశాంతంగా ఆలోచించి జీవితం చక్కదిద్దుకుంటావని ఆశ-వేరే పెళ్ళి నిశ్చయమైనప్పుడు. ఇంక గత్యంతరం లేదు. నాతో వచ్చెయ్యి ఎటైనా పోయి రిజిష్టర్ మ్యారేజి చేసుకుందామని బతిమిలాడేవు. భయపడిపోయి నిరాకరించేవు నువ్వు.చేతులు కాలాక ఇప్పడేం సాహసం చేస్తే ఏం లాభంచెప్పు."

ఈ నెలరోజులూ దక్షిణదేశమంతా తిరిగొస్తాం ఆనందా, నేనూ. ఒక్కమాట అశాంతితో కూడిన స్వార్థంకంటే, అవినీతితో కూడిన సౌఖ్యం కంటె శాంతితో కూడిన త్యాగం మేలు. ధర్మంతో కూడిన నిగ్రహం మంచిది. చేసిన తప్పు అనుక్షణం వెంటతరుముతుంటే ఉల్లంఘించిన వివాహ నియమం అహరహం గుండెల్లో రంపపుకోత కోస్తుంటే సుఖ మెక్కడుంటుంది. శాంతి ఎక్కడుంటుంది. మురికి గుంటలోని జీవులకే. విజ్ఞాన మయంకోశం కలిగివున్న మనిషికీ తేడా ఒక్కదే ఉంది- మనిషికి ఐహిక సౌఖ్యం ఒక్కటే ప్రధానం కాదు. నువ్వు నన్ను పిరికి వాడినని అసహ్యంచుకున్నా నాకేం ఇబ్బందిలేదు.

నీహృదయమంతా పరుచుకొనివున్న అనురాగం నాశనం చేస్తున్నా నని అనుకోకు చాలు. నిజంగా ఏ అనురాగం నీ భర్త హృదయానికి మాలినమై అలంకరించేదిప్పుడే- ఇప్పుడేఈ ఉత్తరం చదవాకే- ఔనుగదా ప్రభా! క్షణికావేశంలో నిర్ణయాలు తీసుకోవడం ఎంత ప్రమాదమో తెల్సింది గదూ!

నీ వల్లనే నేనూ తప్పుదిద్దుకున్నాను- ఇప్పుడు నా ఇల్లాలిగుండెలో పొంగే సంతోషానికి నీకు కృతజ్ఞతలు చెప్తున్నాను. ఇంతసేపూ నేను చెప్పిందేమిటో అర్థం అయిందిగా నామాట వింటావుగా మరి? చివరిమాట. మీదాంపత్యమొక అనురాగమాలికగా విరియాలని మనః పూర్వకంగా కాంక్షిస్తున్నానమ్మా?

యజ్ఞనారాయణ-

ఆమె కళ్ళు అవిరళంగా వర్షించసాగినై.

తలుపు చప్పుడికి ఉలిక్కిపడి కళ్ళు తుడుచుకొని తలుపుతీసింది.

"ఏం చేస్తున్నావు ప్రభా" ఆదుర్దగా లోపలికి వచ్చాడు భర్త. ఉత్తరం అతనిచేతిలో పెట్టేసి నిల్చుండి పోయిందామె. అంతా చదివి మడతలు పెడుతూ "ఔను త్యాగంలో వున్నమాధుర్యం కర్తవ్యాచరణలో వున్న ఆనందం ఎందులోనూ లేవు ఎన్నిచేసినా రావు గుర్తుంది ఆనందా అనుకుంటూ దీర్ఘంగా విశ్వసించాడు మురళీమోహన్ చెంపతడుముకొని.

తర్వాత...

భయంభయంగా లజ్జాభిరామంగా నిల్చివున్న భార్యపంక ఆదరంగా, ఆనందంగా ప్రేమగా చూసి సమీపించాడు. *

# స్వర్గానికి వెళ్ళినా

"ఇహ నేనీ యింట్లో క్షణం ఉండను."

ఆఫీసు నుంచి ఇంటికి వచ్చానో లేదో గుమ్మంలోంచే మొదలు పెట్టింది మా ఆవిడ. మాట్లాడకుండా వెళ్ళి కుర్చీలో కూర్చుని ఆ రోజు పేపరు చేతిలోకి తీసుకున్నాను.

మన బంగారం మంచిదైతే కంసాలివాణ్ణి అనటం దేనికి? ఇందతా నాఖర్మ ఆరునొక్క రాగానికి దగ్గరగా శ్రుతిపెట్టిన గొంతుతో అంటూ కాఫీగ్లాసు తెచ్చి విసురుగా టేబిల్ మీద పెట్టింది.

"భద్రం - టేబిల్ పగిలేను" అని స్వగతం పలుక్కొని "ఇక తప్పదు గదా" అనుకొని "ఏమైనది లక్ష్మీ" అని అడిగాను.

"ఏమైందని మెల్లిగా అడుగుతారేం?" ఎంత రభస కావాలో అంతా అయింది. మీకేం మీరు ప్రొద్దునగా ఆఫీసుకెళ్ళి మళ్ళీ సాయంత్రం వస్తారు. ఈలోపల ఆ మహాతల్లి చేసే హంగామా భరించాల్సిందేమో నేను అన్నది కన్నీటిని బలవంతాన ఆపుకుంటూ.

"అసలు సంగతి చెప్పకుండా మనుషులిట్లా సస్పెన్సులో పెట్టడమంటే ఎందుకంత సరదానో ఈవిడకి?"

ఈ మహాతల్లి పేరు సీతారత్నం మా ప్రక్క వాటా ఆవిడ. మేము వాటాలోకిదిగి దాదాపు ఏడాది కావస్తోంది. దిగిన ముహూర్తమేమిటోగాని మా ఆవిడకి ఆ సీతారత్నంగారికి అనుక్షణమూ చుక్కెదురే కీచులాటే.

రానురాను ఇద్దరి మధ్యా పచ్చగడ్డివేస్తే భగభగ మండటం మొదలుపెట్టింది. ఇవాళ ఏదో జరిగే వుంటుంది యుద్ధం. ఇక ఇల్లు మారిస్తేగాని లాభం లేదు. కాని ఈ మహాపట్నంలో అద్దెకొంప దొరకటంఅంతతేలికా?" రమణ బాబు ఏడుస్తూవుతో నా ఆలోచన ఆగిపోయింది. "ఏమిటి నాన్న? ఏమైంది?'' అన్నా వాణ్ణి దగ్గిరకు తీసుకొని ఒదారుస్తూ.

"మలే చీతాలత్నంగారి చుబ్బారావు కొత్తాలు నాన్నా! వాలి పల కేమో నేను పలగొత్తాను అందుకూ. అంటూ మళ్లీ ఏడుపులంకించుకున్నాడు మా సుపుత్రుడు.

అట్లాగా_ కొడదాంలె ఆ సుబ్బార్రావుని అన్నమాట వరసకి అట్లా అనకపోతే మావాడు గాడిదకూసినా ఊరుకోడోయ్ ఖర్మం. మరుక్షణమే హడలిపోయాను. నడివేసవిలో మిట్టమధ్యాహ్నం వేళ ఉరుములతో సహా నా మీద వర్షం కురుస్తున్నది మరి.

"ఏదో చిన్న పిల్లాడుకదా" అని ఓడెబ్బ వేసినందుకే కొడతారూ మావాణ్ణి! హవ్వ! మీవాడు నిక్షేపమంటి పలక పగలకొడితే బావుందా! ఛా? ఏం మనుషులు? భార్యలచేతిలో కీలుబొమ్మలు అన్నది సీతారత్నం వాళ్ళ గుమ్మంలో శరీరమూ. మా గుమ్మంలో మొహమూ ద్విధా విభజించినదై. భీకరంగా గర్జిస్తూన్న ఆడపులిలాగా వుందావిడ. పీచు పీచు మన్నాయి నా గుండెలు. లేదండీ పిల్లవాణ్ణి ఓదార్చటాని కట్లా అన్నానంతే. మావా డిదే తప్పు. రేపొక పలక కొనుక్కొచ్చి మీ సుబ్బారావుకిస్తాను గానూ'' అన్నా ధైర్యం తెచ్చుకుని.

ఇంతలో ఇల్లు చిమ్ముతాన్న మాశ్రీమతి అక్కడ ప్రత్యక్ష మయినది కాబోలు. ''ఏవిటీ'' అన్న గర్జానినాదాన్ని విని ఉలిక్కిపడి వెనక్కి తిరిగా అది మా భార్యామణి గొంతేనని నిర్ధారించుకున్నాను.

ఎదురుగ్గా గనక ఓ ఏనుగుంటే దానిపైకి లంఘించటానికి రెడీగా వున్న సింహం పోలికలో వుంది శ్రీలక్ష్మి. దానికి తోడు చేతిలో కాంతాకరవాలం ధరించి ఉన్నదాయెను.

"సడెన్‌గా ఝడుసుకున్నానేను. ఝడుసుకుంటూనే ప్రక్కగదిలోకి వ్పు ళని తప్పనిసరిగా ఈ సర్కస్ చూస్తూ నుంచున్నాను.

"ఏవిటి" పలక కొనిస్తారా పలక? ఇంకానయం రెండు పలకలు కొనుక్కు వచ్చి ఫిర్యాదు చేస్తున్నావా? చాల్చాలేవమ్మా. అపరకాళికాదేవి లాగా అవతార మెత్తి మా యింటికి దండెత్తి వచ్చావుగాని తగదునమ్మా అని" అన్నది మా ఆవిడ. కోపంతోపాటు ప్రత్యర్థి శరీరచ్ఛాయను గూర్చిన వెటకారం కూడా మేళవించి-

ఆవిడ మాత్రం తక్కువ తిన్నదీ! తనదండకం వెంటనే ప్రారంభించింది. "లంఖిణి అవతారం నువ్వానూ తెగా వున్నాననిమహాకులుకు. నంగనాచిలా యింట్లోదూరి కూర్చుంటే సరిపోతుందాఅంటూ.

"హతోస్మి. రెండు చెవులూ మూసుకొని చొక్కా తొడుక్కొని బయట పడ్డాను". ఇదుగో వింటున్నారా? ఏమంటోందో వింటున్నారా! అని రెట్టించి రెట్టించి అడుగుతూన్న మాఆవిడ మాట వినిపించుకోకుండా.

అద్దె ఇంటికోసం తిరిగి తిరిగి రాత్రి ఇంటికి చేరుకున్నాను. అట్లా ఓ నెల రోజులు తిండీ, తిప్పలూ గట్రా లేకుండా వెతగ్గా వెతగ్గా నాగృహాన్వేషణ ఫలించింది. ఇల్లంటూ ఏదో ఒకటి దొరికింది, కానీ ఇప్పుడున్న ఇంటికంటే అన్ని విధాలా అధ్వానంగా వుంది. ఆయిల్లు మాత్రం. పైగా అద్దెకూడా ఒక పది రూపాయలు తక్కువే. అయినా సరేవెళ్ళిపోదామంది మా ఆవిడ. ఈప్రక్కవాటా మహాతల్లి పోరులేకపోతేస్మశానమైనా స్వర్గతుల్యమే నన్నది. కానీ క్రొత్త ఇంట్లోకి వెళ్తున్నట్టు ఈ సీతారత్నా

నికి తెలియకుండా రాత్రిపూటే సామాను జేరేసుకోవాలంది. సరే నన్నాను. మరేమంటాను గనక.

కొత్త వాటాలోకి చేరి రాత్రివేళ మేము సామాను సర్దుకుంటుండగా ప్రక్కవాటాలోకి కూడా ఎవరో క్రొత్తగా దిగుతున్న హడావుడితో నిద్ర పట్టక ఇబ్బంది పడి కాస్త ఆలస్యంగానే నిద్రపోయాము.

తెల్లవారింది. తూర్పున బాలభానుడు మనోహరంగా ఉదయించాడు. పక్షుల కలకలారవాలు బహుముచ్చట గొల్పుతున్నాయి. పరవశం కలిగిస్తూ ప్రభాత వాయువు హాయిగా వీస్తోంది. నిద్ర లేచింది మా ఆవిడ శ్రీ లక్ష్మి. ఆవిడ వదనారవిందంపై చాలాకాలం తర్వాత చక్కని చిరునవ్వు కూడా మేలుకొంది.

నన్నుచూపి ఏడాది తర్వాత నవ్వింది. నా అర్ధాంగి. "ప్రకృతి చాలా బావుంది. కందడి ఇక్కడ' అన్నది. ఇల్లు బావుండకపోతే పీడా పోయింది. గానీ ప్రకృతైనా బావుంది అన్న అర్థం ధ్వనించేటట్టు నవ్వి వూరుకున్నాను. పళ్ళపొడి చేతిలో వేసుకుని మొహం కడుక్కోవడానికని వెళ్ళబోయిన మా ఆవిడ నిశ్చేష్టురాలై దిగ్భ్రాంతి పొంది,

చేష్టలు దక్కి గుమ్మం దగ్గరే నుంచున్నది. "ఏవిటి చెప్మా!" అనికుతూహలా మత్తచిత్తుణ్ణై ఏతద్విశేషము నేను కూడా చూద్దామని మా ఆవిడ బుజం మీదుగా వంగాను - ఏమి చిత్రం! బావిగట్టు మీద కూర్చుని పళ్ళు తోముకుంటోంది సీతారత్నం. ప్రక్కనే వున్న ఆమె భర్త సత్యం ఎలావుంది సీతా ఈ యిల్లు? అక్కడ ఇక ఉండలే నన్నా

వని కష్టపడి రెండునెల్లు వెతికి రాత్రికి రాత్రి ఈ ఇంట్లోకి మార్పించాను సామాను. చూశావా మరి? ఎటొచ్చీ ఇల్లు అంత బావుళ్ళేదేమో కదూ!" అంటున్నాడు. అదేమిటండీ ఇంటికేం! ఇల్లు నిక్షేపంలాగావుంది. ఆ పక్కింటి గయ్యాళి పోరు లేకపోతే నరకమైనా స్వర్గంతో సమానంగానే వుంటుంది నాకు" సంతృప్తితో మెరుస్తున్న కళ్ళతో అంటోంది సీతా రత్నం. హా-దైవమా?.

*

# కనకాభిషేకం

అమ్మగోరూ! తెల్లారి పోనాది లెగండమ్మా" అంటూ తలుపు కొట్టింది తాయమ్మ.

బద్ధకంగా లేచి, కళ్ళు నులుముకుంటూనే వెళ్ళి తలుపు తీసింది విజయ. అలవాటుగా మంగళసూత్రాలు బయటికి తీసి పదిలంగా కళ్ళకద్దుకొని పమిట లోపల వేసికొని తర్వాత తాయమ్మ మొహం చూసి ఆ తర్వాత గోడకి తగిలించి ఉన్న దేవుడి కాలెండరుకి దణ్ణం పెట్టుకుని నిత్య కృత్యాల్లోకి జొరబడింది.

అమ్మగారు శతమానాలు కళ్ళకద్దుకున్న కాసేపూ రోజులాగే మంత్రముగ్ధురాలికి మల్లె చూసింది.

"ఆహా ఎంత బావుంటై ఆ శతమానాలు. రూపాయి కాసంత వెడల్పునుంటై ఒక్కొక్కటి చుట్టూ సన్నటి చుక్కల్లాంటి చెక్కడం. మధ్యన ఎర్రనిరాయి. అమ్మగారి తెల్లని ఒంటిమీద అయ్యి ఇంకా మెరిసి పోతయ్యి" అనుకుంటూ మురిసి పోతుంటుంది తాయమ్మ.

"రోజంతా ఉత్సాహంగా గిలకొయ్యలా పనిచేస్తావు కదా- పొద్దున్నే వస్తూనే అలా కలలు కంటున్నట్లు నిలబడి పోతావేం? ఇవాళ శ్రావణ శుక్రవారం కూడాను. తొందరగా వీధి వాకిలి పాచి చేసుకుని రా. నీకు కాఫీ పోసి నేను మడికట్టుకోవాలి. చూడూ ఇవాల్టికి మటుకు కాస్త అసింటా వుండు. ఎట్లాగో ఈ వరలక్ష్మి పూజ అయిందనిపించానంటే... ఇహ ఆ తర్వాత ఫరవాలేదు" అని ఓదండకం చదివింది విజయ.

"అలాగేనమ్మా" అంటూ వాకిలి ఊడవటం మొదట పెట్టింది శతమానాలే మనసులో మెదులుతున్నై. ఇంతలో పక్కింటి వనజాక్షి గోడ వతలనుంచీ ఇవతలికి మొహం పెట్టి "ఏమండోయ్ విజయలక్ష్మి గారూ! మా అమ్మాయిని పంపిస్తాను మీ దొడ్లో పూసిన మందారాలు రెండు ఇస్తారూ? అని కేకేసింది.

"ఆఁ అలాగే అమ్మాయిచేత మీదొడ్లో పూసిన చామంతులు నాలుగు పంపిద్దురూ!" అని సమాధానంగా ఇంకో కేకేసింది విజయ.

"అలాగే కానీ ఇవాళ ఏం కొత్త నగ పెట్టి పూజ చేసుకుంటున్నారు అమ్మవారికి? అని అడిగింది వనజాక్షి.

"చిన్న రవ్వవేసి ముక్కుపుడక చేయించు కున్నానండీ. ఎన్నాళ్ళుగా అనుకుంటే ఇప్పటికి తీరిందనుకున్నారు? లోపల కాఫీ మసిలి పోతున్నట్టుంది. ఇవాళ అసలే ఆలస్యంగా లేచాను. మీ పాపని పంపండి" అంటూ వాడావిడిగా వెళ్ళిపోయింది విజయ.

కాసేపటికి తన ఇత్తడి గ్లాసులో అమ్మగారు పోసిన కాఫీతాగుతూ "అమ్మా నేనొక మాట అడగనా?" అంది తాయమ్మ.

"ఏమిటే తొందరగా అడుగు. ఇవాళ పొద్దున్నే ఆ వనజాక్షితో బాతాఖానీ ఒకటి అది చాలక నువ్వా. ఊఁ కానీ...

"ఇయాల అంతా కొత్త సొమ్ములు సేయించుకుంటారేంటమ్మా "ఔనే ఏ కులమైనాసరే కలిగినంతలో కొత్తవస్తువు బంగారంది చేయించుకుని అమ్మవారికి పెట్టి పూజ చేసుకుని ఆ తర్వాత మనం పెట్టుకుంటే లక్ష్మి ప్రదంట. సకల సౌభాగ్యాలూ కలుగుతైట. ఆసంవత్సరం అంతా ఇంట్లో కనకాభిషేకాలే." అనేవారు మా అత్తగారు. సరేకాని లీలమ్మ

లేచిందేమో చూసి దానికి కాస్త తలంటి పొయ్యి. కొత్త బట్టలు సిద్ధంగా పెట్టుకోమను. పూజవేళకి ఆలస్యం కాకుండాను. ఇహ నన్నుపలకరించకు. మడికట్టుకుంటున్నా. అంటూ స్నానానకి వెళ్లింది విజయ.

లీలకు తలంటుతూ "అమ్మాయిగోరూ! "కనకాబిసేకాలంటే ఏంది? అని అడిగింది తాయమ్మ.

"ఏమిటో పెద్ద పెద్ద మాటలు నేర్చుకుంటున్నావే తాయమ్మా.. వయోజన పాఠశాలలో చేరావా ఏమిటి? రోజూ ఇలాగే నా దగ్గర కొత్త మాటలు నేర్చుకో కనకాభిసేకాలు కాదు ముందు కనకాభిషేకాలు అను" అంటూ థర్డ్ ఫారం చదువుతున్న లీల గురువుగారై పోయింది అమాంతం.

"దానిఅర్దం ఏంటమ్మా?"

"అర్దంకాదు అర్థం."

"పోనీ, ఏదోటి సెప్పండమ్మా"

"బంగారు వర్షమనుకుంటాను" అంది ధాటుగా లీల. "బంగారు వొర్సమే" గుండెమీద చెయ్యేసుకుంది తాయమ్మ.

"ఇదిగో సరిగా మాట్లాడు రాకపోతే నా దగ్గరకొచ్చి నేర్చుకో." అని కోప్పడింది లీల. ఆ తర్వాత రెండ్రోజులు అవస్థపడి 'కనకాభిషేకాలు' అనటం నేర్చుకుంది తాయమ్మ.

ఆ సాయంత్రం-

" రా తాయమ్మా! అమ్మవార్ని చూడు. బావుందా? ఆ గుమ్మంలో నిలబడి చూడొచ్చులే. ఇంకా పేరంటాళ్ళెవరూ రాలేదుగా, ఇంట్లో అల వాటుగా వస్తోందని పండగలప్పుడు మడి కట్టుకుంటాగాని మనుషు

లందరం సమానమే'' అంటూ ప్రేమగా మాట్లాడిన అమ్మగారికి, అలంకృతయై పూజా పీఠాన అధివసించి వున్న అమ్మవారికి అభేదం చేసుకుని దండం పెట్టుకుంది తాయమ్మ.

ఎఱ్ఱటి వెంకటగిరి జరీ చీర కట్టుకుని తెల్ల జాకెట్ వేసుకుంది విజయ. ముడిలో కొద్దిగా చేమంతులు పల్చని చీరలోంచి త్రుళ్ళింత లాడుతూ కన్పించే మంగళసూత్రాలూ, నల్లపూసలూ, చెవులకి తెల్లరాళ్ళ దుద్దులతోపాటు కొత్తగా పెట్టుకున్న రవ్వ ముక్కుపుడకా ఆఫీసరు భార్యనన్న కించిత్తు అహంభావమూ-మిడిసిపడుతోంది విజయ.

"అమ్మాయ్ లీలా! అమ్మవారికి దీపం వెలిగించానుగానీ ఒక పాట పాడవే'' అంది విజయ.

'శ్రీ వరలక్ష్మి నమస్తుభ్యం' అన్నమాట పాడింది లీల. అంత సేపూ అమ్మవార్ని చూస్తూనే ఉంది తాయమ్మ. ఆమెముందు దీపారాధన అగరొత్తుల ఘుమ ఘుమ రకరకాల పూల నెత్తావి. మెరిసే వెండికలశంలో కొబ్బరికాయ పెట్టి, సున్ని పిండితో ముక్కులు, చెవులు అతికించి వాటికి సొమ్ములు పెట్టి, కళ్ళు, నోరూ దిద్ది, సవరం పెట్టి జడేసి, జడ గంటలు పెట్టి, నీలంరంగు దానికి ఎఱ్ఱంచుపట్టు పరికిణీ కట్టి బాలాకుమారిలాగా తయారుచేసింది అమ్మవార్ని విజయ-లీలసాయంతో.

రెండు చేతులూ జోడించింది తాయమ్మ. "అమ్మా వరలచ్చమ్మ తల్లీ! నా ఒక్క కోరికా తీర్చమ్మా! నా కింకే బోగాలొద్దు తల్లీ ఈఒక్క కోరికా...''

"కళ్ళు తెరిచి చెయ్యిపట్టు తాయమ్మా! వాయినం ఇస్తాను. ఇంటి దగ్గర నీ పిల్లాడేడుస్తున్నాడో ఏమో - వెళ్ళు పాపం -'' అంటూ పాకెట్ తెచ్చింది విజయ.

దోసిలి పట్టి అందుకుని "అమ్మగోరూ! మరీ - ఈ నాలుగు రూపాయలూ తమ దగ్గర దాత్తారాండి" అంటూ నలిగిన నాలుగు ఒక్కరూపాయి నోట్లు ఆమె చేతితో పెట్టింది తాయమ్మ.

"దానికేం భాగ్యం - నువ్వు దాచుకోవాలే గాని." అంటూ ఆనోట్లు పట్టుకెళ్ళి మిరియాల డబ్బాలో వేసి వంటింట్లో పై అరలో పెట్టిందివిజయ ఎక్కువ సార్లు ఆ డబ్బా తియ్యక్కరలేదు కదా అని ఆమె అభిప్రాయం.

వీలున్నప్పుడల్లా అందరిళ్ళలో కూడా ఎక్కువపని చెయ్యడం మొదలు పెట్టింది తాయమ్మ ఓ. టీ లాగా - జీతం కాక పైన ఎంత వచ్చినాసరే పాపలాగాని, పది పైసలుగాని విజయకిచ్చి వేసేది.

"నీ డబ్బులతో నా మిరియాల డబ్బా నిండిపోతోంది తాయమ్మా" అని నవ్వుతూ చిల్లరఅతట్నీ నోట్లుగా మార్చి పడేస్తుండేది విజయ.

* *

"అమ్మగోరూ!" అంటూ జ్వరం పిల్లాణ్ణి భుజానేసుకుని వచ్చింది. తాయమ్మ.

"ఏమే ఏమైంది? పిల్లాడట్లా అయి పోయినాడేమిటే మరీను. ఓసి మొండిదానా! మొన్ననే చెప్పానుకదే డాక్టరుకి చూపించమని - ఇంత అశ్రద్ధ చేస్తే వాడు దక్కుతాడా" అని కోప్పడింది విజయ.

"డబ్బుల్లే నమ్మగారూ?" దీనంగా అంది తాయమ్మ. ఆమె కళ్ళంట నీళ్ళు.

"ఏమిటీ డబ్బులేవూ! నా దగ్గర దాచుకున్న డబ్బు ...ఓసే నీకు పిల్లాడి కంటె డబ్బే ఎక్కువా? అసలేం చేద్దామని ఆ డబ్బుతో!"

"అమ్మగోరూ! అయ్యన్నీ తర్వాత ... ముందు జీతంలోంచి అయిదు రూపాయలు అప్పియ్యండమ్మా" అంది.

"ఏమిటే నీ గోల" అంటూ జాలి పడుతూ అయిదు రూపాయలు తెచ్చిచ్చింది విజయ.

ఆ తర్వాత ఇంకో అయిదు కూడా అయితేనేగాని పిల్లాడి జ్వరం తగ్గలేదు.

ఆ నెల ఏనిమిదిరూపాయల జీతం వచ్చింది. సగం పస్తే అయింది. జీతంలో పది రూపాయిలు తగ్గినై మరి—

"ఏమిటో నీ పిచ్చి – సుబ్బరంగా ఆ డబ్బుండగా ... సరే... రాత్రి అన్నముంది తిని పని చేరుకో" అంటూ ఏదో యింత పెట్టే విజయమ్మగోరు సాక్షాత్తూ దేవతే తాయమ్మకి.

ఏడు నెలలైనాక.

"అమ్మా మొత్తం డబ్బెంతుదమ్మా" అని అడిగిందొకరోజు.

"ఏమిటి విశేషం" అంటూ నవ్వి వంద రూపాయల పైనే వుంది. ఇంట్లో వుంటే ఒడ్డిరాదని అయ్యగారు బాంక్‌లో వేశారు" అంది విజయ.

"అమ్మో అడ ఎవుళ్ళన్నా ఎత్తుకు పోతారో ఏంటో అమ్మగారి దగ్గరైతే బద్రం గుండేది గందా" అనుకుంది తాయమ్మ. కానీ ఎత్తుకు పోయేవాళ్ళు వేరే వున్నారవి దానికి తెలీలేదు.

*    *    *

అర్థరాత్రి!

తడికచప్పుడైతే ఉలిక్కిపడి మేలుకుంది తాయమ్మ. డొక్కలో చేరి నిద్రపోతున్న కొడుకుని అవతలికి జరిపి లేచి కూర్చుని "ఏవలాలు" అని అడిగింది. "నేనేలేయే. గట్టిగా అరవమాక" — అంటూ తడికక్కి కట్టినతాడు తొలగించివచ్చేడు సిమ్మాద్రి గుప్పుమన్న సారాకంపుతోపాటు.

"నువ్వా"!

పక్కలో పాముని చూసినట్టు బెదిరింది తాయమ్మ.

"ఏందే ఏందే ఆ బయం కట్టుకున్నోణ్ణి సుసి ఒణికిపోతావేంది? ఎప్పుడూ కొడతానా ఏం?" అంటూ ఆమె పక్క కొచ్చి కూచుని బుజం పట్టుకున్నాడు.

దూరంగా జరిగింది తాయమ్మ.

"ఏందేవ్! పిలగాడి తల్లివైనాక గూడ! చాన్నాలకి మొగుడొస్తే సంబరపడవేంది - సిగ్గా? సమత్కారమా? సరసమా?" అంటూ ఆమె దగ్గర కొచ్చేడు మళ్లీ.

"సెయ్యి తియ్యి ముందు. పిలగాడు పుట్టాడని తెలుసన్నమాట - ఆడు నీ బిడ్డేకాదన్నావు. నానా కూతులూ కూసి ఇల్లోగ్గేసి పోనావు. నిండు సూలాల్ని ఏమైపోతానో అన్న కనికారం లేకపోయింది నీకు. నువ్వు నాకు మొగుడివా? నీ కొడుకా ఈడు? ఆ మాట ఇప్పుడు గుర్తుకొచ్చిందా? నువ్వేం కన్న తండ్రివి? ఒక్కసారి కన్న బిడ్డని సూద్దామనైనా అన్పించ లేదే నీకు ఇన్నాళ్ళూ? సీ!" ఆమె గొంతులో బాధ సుళ్ళు తిరిగింది.

"బొట్టిణ్ణి సూడనేదంటావా? పోనీ సూత్తాను. సక్కంగున్నాడే అచ్చం నీలాగా" అంటూ మళ్ళీ ఆమె దగ్గరకి వచ్చాడు తూలుతుంటూ.

"ఛీ, ఫో – నా దగ్గరకి రావద్దు" అని గింజుకుందామె. "ఎందుకే అంతకోపం? అప్పుడు నిన్ను బాగాసూడలేదు. కొట్టాను. బాదలు పెట్టాను. నిండు సూలాల్ని నిన్ను ఒగ్గేసి పోవాను కోపంలో. తప్పేనే నువ్వు నిప్పు లాంటి దానివని తెల్సే. కాని తాగుడికి డబ్బు చాలక నా బాదల్లో నేనుండి అట్టాసేశా. ఒసే ఒకమాటిను. నువ్వు నాకు డబ్బులియ్యి. నిన్ను నెత్తిమీద పెట్టుకుని సూడకపోతే అడుగు..." అంటూ అమిత లాలనగా "అదట్టుంచు జయమ్మగోరి దగ్గరే డబ్బులు దాసుకున్నావంటగదే అవి పట్టుకొచ్చి పొద్దునెల్లి మనిద్దరం సిలకా గోరింకల్లా గుందాం కావాలంటే నువ్వో పది రూపాయలు తీసుకో! మిగతావె నాకిచ్చి నిన్ను రాణీలాగ బొట్టెణ్ణి యువ రాజులాగ సూసుకుంటా" అన్నాడు సిమ్మాద్రి.

విచిత్రంగా నవ్వింది తాయమ్మ. "డబ్బేనామావా? డబ్బేగా నీక్కావలసింది. సరే ఉండు" అంటూ బయటికి పరుగెట్టింది.

"ఓ లప్పలమ్మోవ్! ఎంకన్నతాతా! జోగులన్నా! లచ్చిమ్మొదినో! రండర్రో సిమ్మాద్రి తాగొచ్చి గోలసేత్తనాడప్పల్లారో" అని కేకలు పెట్టింది.

క్షణాలమీద చుట్టుప్రక్కల గుడిసెల వాళ్లు పొగైనారు. వాళ్లల్లో ఆ సమైక్యత ఉంది. మధ్య తరగతిలో లేని ధైర్యముంది.

"ఏంరా దాన్ని పెట్టిన ఇంసలన్నీ సాల్లేదేంట్రా, మళ్లీ సేరినావు. సీతమ్మోరు లాంటిదిరా తాయమ్మ. నువ్వొగ్గేసినంక కూంత అయిగ బతుకుతోందిరా సిమ్మాద్రీ. నాలుగిళ్ళళ్ళో చాకిరీ చేసుకుని ఆ బొట్టెణ్ణెట్టు కుని సుకంగుంది. పో, పో." అంటూ కోప్పడ్డాడు అందర్లోకి పెద్దవాడు వెంకన్నతాత–అక్కడ చేరిన ఆడవాళ్ళతో సహా అందరూ అలాగే అన్నారు.

పటపట పళ్ళు కొరికాడు సిమ్మాద్రి. "సరే ఇప్పుడు పోతున్నా. ఇల్లలకగానే పండుగవుద్దేటి? సూద్దువుగాని ఈ సిమ్మాద్రి తడాఖా, మంచిగ నే చెప్పిన మాటిని డబ్బు తెస్తివా సరే, లేదా మడిషికాడీ సిమాద్రి" అంటూ మీసాలు మెలేసి వెళ్లిపోయాడక్కణ్ణుంచి.

అందరూ వెళ్లిపోయాక మెల్లిగా ఆమె దగ్గరికి వచ్చాడు నారాయణ.

అతణ్ణి చూసి "మావా?" అంటూ ఏడ్చేసింది తాయమ్మ.

"ఛ ఏందే ఇది? నీ ధైర్య మేటయింది? లోపలికిపద ముందు. పిలగాడు ఒక్కడూ తొంగున్నాడు దడుసుకుంటాడేమో" అంటూ ఆమె కన్నీళ్ళు తుడిచాడు నారాయణ.

"మావాఁ సిమ్మాద్రి పిలగాడి కన్నతండ్రి. ఆడికిలేని ఆపేచ్చ పరాయోడికి నీకుండంతే సాలు మావాఁ. నా బిడ్డ నీ ప్రేమకైనా నోచుకున్నాడు. అంతేసాల్లే అంటూ ఏడ్చింది తాయమ్మ.

నవ్వాడు నారాయణ.

"నువ్వొట్టి పిచ్చిదానివేతాయమ్మా. పసి బిడ్డలు భూమిమీద నిలిపిన భగవంతుళ్ళే ఆళ్ళమీద మమకారం ఎవరికుండదే పైగా ఆడు నీ కొడుకే నీ కొడుకు" అతని కంఠం కూడా రుద్ధమైందీసారి.

"లోపలికి రా మావాఁ అని పిల్చింది తాయమ్మ.

"రానే రాకూడదు."

"ఎందుకని!"

"ఛానే పరాయి ఆడదాని గుడిసెలోకి అర్ధరాత్రి రాకూడదే."

"నేను పరాయిదాన్నా మావాఁ?"

"కాక? ఇన్నాళ్ళుగా అడుగుతున్నా. మారు మనువుకొప్పుకోవే. పువ్వుల్లో పెట్టి సూసుకుంటానంటే ఇనవు. ఒక్కదానివే బొట్టిణ్ణెట్టుకు గుడిసెలో తొంగుంటావు. మంచొచ్చినా శబ్బరొచ్చినా మణిసికి మణిసికి తోడుండాలే. ఇయ్యాల మేమందరం సుట్టుపక్కలున్నాం గనక సరిపోయింది. నువ్వొక్కడివి నన్ను కాపాడగలవా అంటావేమో. నీకోసం ఏదన్నా చెయ్యాలనిపిస్తుందే తాయమ్మా! నా పేనాలేనా ఇస్తానే నీకోసం. పెళ్ళి కొప్పుకోయె. నిన్నూ బొట్టిణ్ణి రాణీ యువరాజులాగ సూడలేనుగాని మణుసులకుమల్లే సూడగలనే. నా రెక్కలకట్టం, నా రిచ్చామీద రాబడి అంతా తెచ్చి నీ దోసిట్లో పోత్తా. నీ ఇట్టం. ఇంక ఆవేదనగా ఆశగా తాయమ్మ చేతులు పట్టుకున్నాడు నారాయణ.

తాయమ్మ అమితానందసంధాయి అయింది. కడుపున పుట్టిన బిడ్డకంటే, తనంటే ప్రాణంపెట్టే భర్తకంటే ఆడదానికి ఈ ప్రపంచంలో కావల్సిందేముంది మరి.

సిగ్గుపడుతూ "ఇంక నాలుగు నెలలు ఆగు మావాఁ సాలు" అంది.

"ఏటే ఏంటంటున్నాయే నువ్వు, మళ్లీసెప్పు" ఆమె భుజాలు పట్టుకుని ఊపాడతను.

"నా మగణ్ణి సూసినంక పెపంచకమే చీకటై పోయింది మావా నాకు. మగోల్లంతా దరిద్రపోల్లె అనుకునేదాన్ని. తర్వాత నువ్వు కన్పించావు. మగాలలో నీలాంటోలు కూడా ఉంటారా అని ఆచ్చెర్యమేసింది నాకు. మొదటిసారి నువ్వు మనువాడదామా అని అడిగినప్పటినుంచీ...

ఆగిపోయిందామె. సిగ్గుతో నోరు పెగల్లేదు.

"ఆ అడిగినప్పట్నుంచి సెప్పవే తాయమ్మ" అతని గొంతులో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతోంది.

"డబ్బు కూడాబెడతావున్నా"

"డబ్బా? డబ్బెందుకే"

"పెళ్లికోసం"

"పిచ్చిమొహమూ మనదేమన్నా గొప్పోళ్ల పెళ్ళా? మనకెంత కావాలి! యాభై రూపాయిలైతే ఎక్కువ. దేవుడి గుడికెల్లి ఇద్దరం దణ్ణం పెట్టుకోవడం, నీ మొహాన నేను కుంకుమ పెట్టడం మెళ్ళో పసుపు కొమ్ము కట్టడం. చెరోజత కొత్త బట్టలు కొనుక్కుంటే సరిపొద్ది.

"సిన్నప్పట్నించీ గొప్పోళ్ల పెళ్లిళ్ళు శానచూసినా మావా. ఆళ్లలా నాకు బంగారు శతమానాలు కట్టించుకోవాలని వుండేది. సిమ్మాద్రి కూడా పసుపుకొమ్మే కట్టాడు. నాకు శతమాలాంటే ఎంతిట్టమో మావా బంగార మంటి మణిసివి. నీసేతనైనా మెళ్లో బంగారు పుస్తెలు కట్టించుకోనీ మావా. ఈ మనసుసెల్లనీ?"

"అలాగేకానీ మనువు కొప్పుకున్నట్టు నాకు సెప్పనేలేదు. ఈలోపల నే నింకో మనువాడేసి వుంటే!" కొంటెగా అడిగాడు నారాయణ.

"ఆడవని నాకు తెల్సు?"

"తాయమ్మా."

"ఔను మావా! నేనంటే నీ కెంత ఇట్టమో నీ కంటే నాకే బాగా తెలుసు."

"నాకు సెప్పే నేనూ దాచేవోణ్ణిగాదే డబ్బు. నువ్వు దాయట మెందుకే. నీమోజు నేను కాదంటానా? బంగారు శతమానాలు కావాలంటే సాలు అవి తెచ్చి నీ మెళ్ళో కట్టే బాధ్యత నాదికదే. నీకెందుకా బారం. రిచ్చా మీద సంపాదించిదంతా కూడబెట్టకుండా తగలెట్టాగదే ఇన్నాళ్లూ.

నువ్వొప్పుకోలేదన్న ఇరక్తితో, సరేయే ఆ డబ్బు నువ్వుంచేసుకో. పోనీ పిల్లాడికోసం దాయి. గానీ శతమానాలు నే తెత్తాలే. రేపే పేశాడేద్దాం అన్నాడు నారాయణ.

నాల్గు నెలల్లో శావణ మాసం వత్తదంట. అప్పుడు శుక్కురోరం నాడు అమ్మోరికి కొత్త బంగారం సొమ్ము పెట్టి అని మనం పెట్టుకుంటే శానమంచిదంట. ఇజయమ్మగోరు సెప్పారు. అప్పటికి డబ్బు కూడు తుంది. శతమానాలు కొని పూజ సేసి అయ్యి నీచేత...

ఎంత తెలివైనదానివే ఈయమ్మా.

ఇంత ముందుసూపున్న ఇల్లాలు దొరకటం నాఅదురుట్టమే. ఇంతకి ఎంతుందే శతమానాలు? వంద రూపాయిలు సాలా?

కాదట మూడు వందలన్నా ఉంటాయంట సిన్నవే 'అమ్మోఅంటూ గుండె మీద చెయ్యేసుకున్నాడతను. వెంటనే.

బంగారవంటి మణిసి నన్నావు. నేను పొల్దేటే నీకు? బంగారు శత మానాలు గావాలా? అని నవ్వుతూ ప్రశ్న కూడ వేశాడు.

నీ గుణాలకి బంగారం జోడిస్తే ఇల్లంతా బంగారమే అవుతుందని.

ఆ ఆ ఏం సక్కగ సెప్పావే. సరే నీ మనసెందుకు కాదనాలి? అలాగే కానీ మా షావుకారు దగ్గర నేను దాత్తాలె డబ్బు.

ఆ తర్వాత ముసి ముసి నవ్వులతో గుడిసెలోకి వరుగెత్తింది. ఈయమ్మ కొడుకుని గుండెకు హత్తుకొని ఆదమరచి నిద్ర పోయింది.

కాని ఈమాటలన్నీ గుడిసె పక్కన నుంచుని విన్న సిహ్మాద్రికి మటుకు పగతీర్చుకోందే నిద్ర పెట్టేట్లులేదు. అందుకు నాందిగా పళ్ళు కొరికాడు. "రాడి ఖాంచోత్. మారు మనువాడతావంటే" అని.

ఆ తర్వాత ఇంకో రెండు నెలలు జరిగినై.

"సరిగ్గా శ్రావణ మాసానికి గాని మూడొందలయ్యేట్లు లెవే తాయమ్మా. ఎంత తొందరపడ్డా ఈ లోపల నీ పెళ్లయేట్లు లేదు" అంటూ నవ్వింది ఓసారి విజయ ఈ పెళ్ళి వృదంతమంతా విని. ఆమె భర్త రామారావుక్కూడా ఉత్సాహంగా ఉంది. తమ దంపతులిద్దరూ ఏదో ఘనకార్యం చేసి తాయమ్మ నుద్ధరిస్తున్నట్లు ఫీలవటం మొదలు పెట్టాడు.

"మనమేం చేశామండి. దాని డబ్బేగా దాచాం" అంది విజయ ఒక రోజు.

"బ్యాంకులో వేసి వడ్డీ కూడా ఇప్పిస్తూన్నామా లేదా? మారు మనువుకి మనస్ఫూర్తిగా ప్రోత్సాహమిచ్చి, పురోహితుణ్ణి సైతం మాట్లాడి చిన్నప్పట్నించి తమ కలలుకన్న పద్ధతిలో పెళ్ళి కేర్పాట్లు చేద్దామనుకుంటున్నాంగదా. ఇంకేం చెయాలి? అన్నట్లు పెళ్ళి పెద్దవు నువ్వే కాబోలు. పాతికో ముప్పయ్యో పెట్టి పీటలమీదకి తాయమ్మకో చీర కొనివ్వు" అన్నాడు రామారావు.

"పాతిక్కీ ముప్పైకీ చీరలొచ్చే రోజులు పోయాయండోయ్. నలభయ్యో, యాభయ్యో పెడితే మామూలు చీర వస్తుంది. శ్రావణంలో దొరగారి బడ్జెట్ చూసుకోండి" అంది విజయ.

ఎదురు చూసిన శ్రావణం చినుకులతో జల్లులతో రానేవచ్చింది. వచ్చి పేరంటాళ్ల కలకలలతో పట్టుచీరల రెపరెపలతో నవవధువుల

గుసగుసలతో కన్నెపిల్లల అరమోడ్పు కళ్లలో నిండిపోయింది. వాతావర ణం వర్షపు తుంపురుల మధ్య ఇంద్రధనస్సులా మెరిసి పోయింది.

ఎలుండే శ్రావణ శుక్రవారం. ఆ రోజుకి పెళ్లి ఏర్పాటు పూర్తి అయేటట్లు రెడీచేసింది విజయ. "సాయంత్రం మీరిద్దరూ నాతో బజారుకి రండి. వచ్చిన మంగళ సూత్రాలు, కొనుక్కుని ఇంకా డబ్బు మిగిలితే పెళ్ళికి అవసరమైనవి కొనుక్కోవచ్చు. అయ్యగారు బాంకు నుంచి డబ్బు తెచ్చి నాకిచ్చేశారు". అని చెప్పింది ఆరోజు పొద్దున.

ఆఘమేఘాల మీద తేలిపోతున్నాడు నారాయణ. తాయమ్మ పరి స్థితి మరింత ఉక్కిరి బిక్కిరిగా ఉంది. తనకు ఊహ తెలిసినప్పట్నించి కోరుకుంటున్న పసిడి శతమానాలు ఎలుండే తన మెళ్లో కట్టించుకో బోతు న్నది. తనకెంతో ఇష్టమయిన నారాయణ చేత విజయ గారింట్లోపనిచేస్తూనే వాకిట్లో కొచ్చి చూసి పోతోంది మాటి మాటికి.

"వస్తాడు లేవే నీ తొందర కూలా.ఏడాది ఒర్చుకున్నావు. ఇప్పుడిక ఆగలేనా?" అని హాస్యాలాడుతోంది విజయ.

అక్కడ షావుకారుదగ్గర తను దాచుకున్న డబ్బుఅడిగి తీసుకుని స్నేహితుడు జోగులుతోకలిసి తాయమ్మ దగ్గరకి బయలుదేరాడు నారా యణ. అంతలో ఎక్కణ్ణించొచ్చాడో గొడ్డలితో వచ్చి మీదపడ్డాడు సిమ్మాద్రి.

గబుక్కున అడ్డంవెళ్లాడు జోగులు. మరుక్షణం గొడ్డలి తాకిడికి అతని తలభళ్లుమంది. పగిలినపుర్రె ప్రవహిస్తున్న రక్తంచూసి 'బాబోయ్' అని అరిచి పారిపోయాడు సిమ్మాద్రి.

"తాయమ్మా!"

"ఏంది మావా ఛ - ఏంవా కన్నీళ్లా, ఇయ్యాల సంతోషంగుండాల్సిన రోజు. ఏమైందనిప్పుడు?"

ఆమె మెళ్ళోపసుపు తాడుకికట్టివున్న పసుపుకొమ్ము చేత్తో పట్టుకొని. "మళ్లీ నీకిడితప్పలేదే- ఇక్కడ రెండుశతమానాలు మెరిసి పోతుండాల్సిన మాట. నావల్లే పాపం నువ్వెంతకలవరించిన కోరిక తీరకుండా..."

భర్తకన్నీళ్లు తుడిచి ఇలా అంది తాయమ్మ. "నువ్వొత్త పిచ్చి మావవి జోగులన్న పెళ్ళాం మాలచ్చంమ్మొదిన మెళ్ళోతాడు నిలబెట్టింది. పసుపుకొమ్మే కదయ్యా. ఆరోజు డాక్టరుబాబుకి మనిద్దరం పోగుసేసుకున్న డబ్బంతా ఇత్తేనెగందా జోగులన్న పానాలు నిలిపాడు తలకి ఆపరేషనుచేసి. మనం మన స్వార్తంసూసుకుని ఆ డబ్బియ్యకపోయామనుకో, శతమానాలూ సిల్కుసీరా వచ్చేవేగాని నా తాడు నిలిపిన లచ్చమ్మొమ్మొదిన తాడు తెగిపోయుండేది. నీ పానాలకు పానాలొడ్డిన జోగులన్న బిడ్డలుదిక్కులేని వోళ్లయ్యేవాళ్ళు. ఒక కుటుంబం గొలునఏడుత్తుంటే ఆ ఏడుపుల మద్దెన కులుకుతూ పైడి మంగళ సూత్రాలూ ఎట్టాకట్టించుకోను. మావా నేను మణిసిని మావా. రాచ్చసినికాను. ఒకరికి ఆలిని మరొకరికి తల్లిని నాతోటి మణిసుల బాధ నాదికదా. సెయ్యలేనపుడు సరే సెయ్యగలిగినప్పుడెందుకు ఎనకాడాల? ఎక్కడికక్కడే సంతోషపట్టం నేర్చుకోవాలమణిసి. నువ్వు చెప్పినమాటే రైటు మావా.నాకిప్పటికి కళ్ళు తెరిపిడి పడినై. బంగారమంటి మణిసివి నువ్వు నాకుండగా ఏరే బంగారుసూత్రాలు ఎందుకు మావా? మనం డబ్బిచ్చి జోగులన్నను ఆసుపత్రిలో జేర్పించినప్పుడు లచ్చువమ్మొదిన సూసిన సూపులు సాలు మావా. నాఇల్లు కళకళలాడటానికి. వేరే లచ్చిందేవికి పూజలక్కర్లేదు.మా వదిన సూపులే మనకు కనకాభిషేకాలు!

# విజయోస్తు

అది థర్డ్‌పీరియడ్. ఎడోక్లాసు పిల్లలకి అశోక చరిత్ర కాబోలు పాఠంచెప్తు న్నారు. అంతలో మధ్య బెంచీలోనించి చిన్న కలకలం బయలుదేరింది. పాఠం ఆపి ప్రశ్నార్థకంగా అటుచూశాను. రఘులేచి నుంచున్నాడు.

"ఏం బాబూ!" అని ఆదరంగా అడిగాను.

"రాజు నన్ను వెక్కిరిస్తున్నాడు టీచర్! నడుంమీద చెయ్యిపెట్టు కుని" అన్నాడు బేలగా-పొడుగ్గా పదిహేనేళ్ళ వయస్సులో వున్న అతని కళ్ళల్లో నీళ్ళుతిరుగుతున్నై.

"రాజూ! ఇలారా!" అన్నాను- నెమ్మదిగా పిల్చినా నాగొంతులో కోపం తెలుస్తున్నట్టుంది. భయపడుతూ వచ్చాడతను. విద్యార్థులను శిక్షించ టానికి హెడ్‌మాస్టర్‌గారు ఇచ్చిన బెత్తం ఎదురుగావుంది. దానివైపొకసారి పరీక్షగాచూశాను. మళ్ళీ రాజువంక చూశాను. బెత్తంచేతిలోకి తీసుకుని మెల్లిగా తిప్పుతూ అడిగాను. "ఏం బాబూ! రఘును వెక్కిరించావుట?'అని.

రాజు మాట్లాడలేదు. వణికిపోతూ నుంచున్నాడు. కొడతానని కాబోలు. నేనీస్కూలుకు కొత్తగా వచ్చాను. నా సంగతి సరిగ్గా తెలియదు వీళ్ళకి.

"చెప్పురాజూ" అన్నాను మళ్ళీ.

"నేనేం వెక్కిరించలేదండీ! నానడుంమీద నేను చెయ్యిపెట్టుకున్నా నంతే" అన్నాడు రాజు బింకంగా—

"అంతేనా? నిజం నీ మనసుకు తెలుసుకదూ" అన్నాను.

కాసేపు బెదురుగాచూసి అవునన్నట్లు తల వూపాడు.

"రాజూ! నువ్వు కావాలనే అట్లాచేశావు. నడుముమీద చెయ్యి పెట్టుకుంటే రఘు ఇర్రిటేట్ అవుతాడనేకదా. తోటిపిల్లవాడిని, అందులో మతిస్థిరంలేని వాడిని హింసించడం తప్పని ఎన్నిసార్లు చెప్పాను? అమాయకులను హింసించటమేనా మన గొప్పతనం? అందుకేనా అన్నిజన్మల్లోకీ గొప్పదైన మానవజన్మ మనకిచ్చాడు దేవుడు? మన తెలివి చురుకుదనం అంతా ఇందుకేనా? చక్కగా చదువుకుని, మంచిమార్కులు తెచ్చుకొని, అభివృద్ధిలోకివచ్చి, సుఖపడటానికి పనికిరావా?" అని తీక్షణంగానే అడిగాను.

రాజు తల వంచేసుకున్నాడు- మిగతా పిల్లలంతా నవ్వారు.

"ఎందుకు నవ్వుతారు? రఘుని ఏడిపించి మనం గొప్పపని చేశాం అనా? ఇదేమిటీ టీచర్‌కి పిచ్చిపట్టిందేమో. ఏదో ఏదో చెప్తుంటుంది అనా? అవునయ్యా! మంచి మాటలు చెప్తే మీకు నవ్వులాటగానే వుంటుంది. చెప్పే విధంగా చెప్పాలి. మన హెడ్‌మాస్టర్‌గారు చెప్పినట్లు" అంటూ బెత్తం ఆ చేతిలోనించి ఈ చేతిలోకి మార్చుకుని సాభిప్రాయంగా చూశాను.

హఠాత్తుగా చీమచిటుక్కుమనేటంత నిశ్శబ్దం.

"రాజా! నిన్ను కొట్టను దా ఇలా-నాపక్కన నుంచో పిల్లలందరికీ కన్పించేటట్లు—" 'ఇంకెప్పుడూ ఇలా చెయ్యను నేను తప్పు చేశాను. నా తప్పు ఒప్పుకుంటున్నాను. రఘు నాకు అన్నలాంటివాడు' అని మనస్ఫూర్తిగా చెప్పు క్షమాపణ" అని నుంచోబెట్టాను.

క్లాసువేపు తిరిగి "మీలో ఎవరైనా నవ్వారో ఇదేపని చెయ్యవలసి వుంటుంది" అని హెచ్చరించాను.

ఎలాగో గుక్కిళ్ళు మింగుతూ చెప్పాడు రాజు. ఈ అవమానం సహించడంకన్నా దెబ్బలు తినడమే ఎక్కువ సులువు పిల్లలకి! అందుకే ఇలాంటప్పుడీ పద్ధతి అవలంబిస్తున్నాను ఎక్కువగా-

ఆ రోజుకు పాఠం పూర్తిచేసి స్టాఫ్‌రూములోకి వచ్చేశాను.

"ఏమిటోనబ్బా! సుమిత్రగారు ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటారు" అన్నది లక్ష్మీకాంతం.

"ఏమిటి సోదరీ! ఆ దీర్ఘాలోచన మాకు విన్పించుట కభ్యంతరమా?" అని పార్వతి అందుకున్నది.

"బావుందండోయి పార్వతిగారూ? గ్రాంధికం" అన్నాడు శేషావతారం.

"నేను చెప్పనా-ఏడోక్లాసులో లేడూ రాఘవేంద్రరావు నామధేయుడు అదొక రకంగా అమాయకంగా ఉంటాడు. అతణ్ణి గురించే అవిడగారి ఆలోచనంతా"అన్నాడు గోపాలకృష్ణ— ఇంగ్లీషుమాష్టారు.

నా మనస్సులోని ఊహలను సైతం పసికట్టగల అతని నేర్పుకూ, అతని సిన్సియారిటీకి, నే నెప్పుడూ ముగ్ధురాలినౌతూనే వుంటాను.

"అతనా? అతను మంచి తెలివిగా మాట్లాడతాడండోయి! పిచ్చివాడనే అనిపించదు. ఒక్కొక్కసారి నడుముమీద చెయ్యి పెట్టుకుంటే ఇర్రిటేషన్ వస్తుందిట అతనికి-అదేమిటోమరి" అన్నది రాధ.

"అబ్బే! మీరుకొత్తగా చేరారుగదా ఈ స్కూల్లో సుమిత్రగారూ! కాస్త మాఉపదేశం వినాలి-లేకపోతే కష్టం- శరీరసంబంధమైన సర్వబాధలూ అంటకుండా, ఎప్పటికప్పుడు దులిపేసుకుని, ఆత్మ ఎట్లా నిర్మ

లంగా వుంటుందో స్కూలుకి సంబంధించిన సర్వ విషయాలు స్కూల్లోనే వదలిపెట్టేసి— సుఖంగా వుండాలి మనం-కనికరం పనికిరాదు. జాలిపడితే మనపని గోవిందా!'' అని వ్యంగ్య గర్భితోపదేశం కావించారు మల్లికార్జునరావుగారు.

''ఉండవయ్యా! నీ ఫిలాసఫీ నువ్వూను. అఘోరించినట్టే వుందిగాని. ఉత్సాహవంతులకి కాస్త ప్రోత్సాహమైనా ఇవ్వకపోగా, నిరుత్సాహపరుస్తావూ?'' అని అతన్ని మందలించాడు జాకబ్.

''ఏమైనా సరే, అతనికి మనం చదువుచెప్పి బాగుచెయ్యలేము. మూడేళ్ళనించీ తప్పుతున్నాడే ఏడోక్లాసు— చ్చ్-ఇంకేం పాసవుతాడు? మెదడు చెడుతున్నకొద్ది పొడుగు మటుకు పెరుగుతున్నాడు'' అన్నాడు సుదర్శనం.

అన్నీ విని గోపాలకృష్ణా, నేనూ నవ్వేసి వూరుకున్నాం.

ఇంటికొచ్చాకగూడా రఘుని గురించిన ఆలోచనలే నాకు. ఆ అబ్బాయి ఎట్లా బాగుపడతాడూ అని. అమ్మానాన్నలకీ, తమ్ముళ్ళకి, చెల్లెళ్ళకీ అందరికి చెప్పా అతని గురించి.

పాపం చిన్నప్పుడు చాలా తెలివిగా వుండేవాడట. అయిదేళ్ళకే అతని ప్రతిభను చూసి తల్లిదండ్రులు మురిసిపోయేవారట.

అప్పుడు ఒకసారి కారుప్రమాదం జరిగి మెదడుకి దెబ్బ తగిలి యిలా అయిపోయాడట. వాళ్ళ నాన్నగారు చెప్పారు ఒకరోజు. పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, మెదడు బాగుపడే అవకాశం వుందని మటుకు ఆశగా చెప్పాడట డాక్టర్.

మర్నాడు స్కూలుకు వెళ్ళంగానే యథాప్రకారంగా పరుగెత్తుకుంటూ వచ్చి ''గుడ్‌మార్నింగ్ టీచర్!'' అని విష్‌చేశాడు రఘు.

ఇంకా ఫస్ట్‌బెల్ కూడా కాలేదు.

''రాత్రి ఎంతసేపు చదివావు రఘూ? ఏమేం పాఠాలు చదివావు?'' అని అడిగాను.

''రాత్రా... రాత్రీ...?'' అని బుఱ్ఱ గోక్కుంటూ ఆలోచనలో పడ్డాడు.

''మార్చిపోయావా? ఒకొక్క విషయం ఎరసగా గుర్తుతెచ్చుకో.. ముందు ఇంటికేళ్ళగానే ఏం చేశావు చెప్పు'' అని అడిగా—

''మరే—వెళ్ళగానేనాండి? మాచిన్నతమ్ముడికి పాలడబ్బా,మానాన గారికి వక్క పొడి పొట్లామూతెచ్చా''.

''ఆహాఁ నువ్వు బజారుకెళ్ళి సరుకులు కూడా తేగలవన్నమాట-''

''ఓ—అన్ని సరుకులూ నేనే తెస్తా టీచర్!'' ఉత్సాహంగా అన్నాడతను.

నేను ఆశించిన ప్రయోజనం కన్పించింది. ఆ పిల్లవాడి మొహం మీద చిన్న సంతృప్తిరేఖ మెరిసింది.

''ఇంకేం తర్వాతేం చేశావూ?'' అని అడిగా.

"తర్వాతేమో మానాన్నగారి అలమారా అంతా సర్దమంటే సర్దాను.. మా అన్నయ్యకు చాకలి దగ్గిర్నించి బట్టలు తెచ్చిపెట్టా—"

"తర్వాత!"

"అమ్మకు వంటపనిలో సాయంచేశాగా'' సగర్వంగా చెప్పాడు.

"అలాగా, బావుందోయ్ మరి మీ అక్కలూ, చెల్లెళ్లూ మీ అమ్మగారికి సాయం చెయ్యరా?" అని ప్రశ్నించాను జంకుతూనే.

"ఊహూఁ ఎలా చేస్తారు? వాళ్ళకెప్పుడు పరీక్షలూ, సినిమాలూ, డ్రామాలూ అవీ వుంటాయిగా. మరే టీచర్, మొన్న అక్కతో వెళ్తానంటే అమ్మ ఎంత తిట్టిందో "మతిలేనివెధవా! అక్కడికెళ్లి ఏం పేల్తావో? అసలే దాని స్నేహితులంతా గొప్ప గొప్పవాళ్ళు. అయినా నీ కెందుకురా పిక్నిక్కులూ! కాస్త ఇలారా—కందిపచ్చడి రుబ్బిపెట్టు" అంటూ లోపలికి లాక్కెళ్ళింది. "ప్చ్! ఎవరూ నన్ను ఎక్కడికీ తీసుకెళ్ళరు" ఏడుపు మొహంపెట్టి—చొక్కాతో కళ్ళు రుద్దుకున్నాడు.

"అలా చొక్కాతో కళ్ళు తుడుచుకోకు. జేబురుమాలు తెచ్చావా రఘూ!" అన్నాను.

"రుమాలా? నాకు లేదుగా—మొన్న చెల్లెల్ని ఇవ్వమని అడిగితేనూ అది—ఏమందంటే..." ఆ మాటలేవో మర్చిపోయినట్లున్నాడు, తల గోక్కుంటూ ఉండిపోయినాడు.

"సర్లే—నేను రేపొకొత్త రుమాలు తెచ్చిస్తాలేగానీ- మీ అమ్మగారు నిన్ను మతిలేనివాడంటారా?" అని అడిగా సాలోచనగా నా మనస్సు చురుక్కుమంటుండగా.

"అవును. ఎప్పుడూ అంటారుగా—పాపం మానాన్నేనండి ఎప్పుడైనా బిస్కెట్లు తెచ్చిపెడతారు" అన్నాడు. అంటూనే వెనక్కి తిరిగాడు "రేఁయ్!" అంటూ పరిగెత్తటం మొదలుపెట్టాడు.

"అరే! రఘూ! ఏమిటిది! ఇలారా" అంటూ గబగబ అతని వెనకే వెళ్ళాను.

అప్పటికే నలుగురైదుగురు పిల్లలుపోగు పడ్డారక్కడ. రఘూ మరో అబ్బాయీ తన్నుకుంటున్నారు.

ఆగండి బాబూ! ఏమిటిది? తప్పుకాదూ?" అని వారించానుగానీ, నామాట వాళ్ళేం విన్పించుకున్నట్లు కన్పించలేదు.

అటూ యిటూ చూశా—అంతదూరంలో మల్లికార్జునరావుగారూ, గోపాలకృష్ణ కన్పించారు—

"మేష్టారూ:" అని కేకేశా—గబుక్కున వచ్చి యిద్దర్నీ విడదీశారు వాళ్ళు.

"మేడమ్‌గారేదో ప్రియ శిష్యుడిచేత సీన్ సృష్టి చేయించారే పొద్దున్నే"అన్నాడు గోపాలకృష్ణ తమాషాగా—

"నాకు కా స్తపనుంది. వస్తా" అని వెళ్ళిపోయినారు మల్లికార్జున గారు. అనవసరంగా గొడవల్లో యిరుక్కోవటం దేనికని గాబోలు—

"ఉండు—నన్ను కొడతావురా పిచ్చిరాస్కెల్! నిన్నేం చేస్తానో చూడు" అని వగరుస్తున్నాడు ఆ రెండో పిల్లవాడు.

"అతనెవరో తెలుసా? వాసు-అంటే యెవరో తెలుసా? ఒకానొక పుర ప్రముఖుడి సుపుత్రుడు" అని మెల్లిగా నాకుచెప్పాడు గోపాలకృష్ణ.

"నన్ను యెక్కిరిస్తున్నాడు సార్! నడుంమీద చెయ్యి పెట్టుకుని —రోజూ ఇంతేసార్. అందరూనన్ను ఎక్కిరిస్తారండీ" అంటూ వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టాడు రఘు.

తనంత ఎత్తున ఆ పిల్లవాడి భుజాన్ని అప్యాయంగా, ప్రేమగాతట్టి ఏదో అనబోతున్నాడు గోపాలకృష్ణ. ఇంతలో మిమ్మల్ని హెడ్‌మాస్టర్ పిలుస్తున్నారంటూ కబురొచ్చింది.

నావైపు తిరిగి "చూశారా సుమిత్రా!

అప్పుడే హెచ్.ఎమ్. కబురు చేశారు. ఏమి దూరదృష్టి? ఇక్కడ జరిగిం గంతా విన్నవించుకోవాలిప్పుడు వెళ్ళి" అన్నట్లు సాభిప్రాయంగా నవ్వేసి వెళ్ళాడతను.

"ఎందుకు మీరలా వెక్కిస్తారు రఘుని? భగవంతుని దయ సరిగ్గా వుండబట్టి కదా ఈమాత్రంగా వున్నాం మనం ఇందులో మన ప్రయోజకత్వం ఏముందయ్యా? పాపం. ఆ పిల్లవాడిని ఏడిపించి ఏం బావుకుంటామని? అతన్ని బాధపెడితే మీకేమన్నా ఆనందం కలుగు తున్నదా? పోనీ, కలిగితేదాన్ని పైశాచికానందం అంటారు. ఒక వేళ మనమే రఘు పరిస్థితిలో వున్నామనుకోండి. మనలను కూడా మిగతావాళ్ళు యేడిపిస్తారు గదా! అప్పుడు ఎట్లా వుంటుంది? మనం మనుషులం నాయనా! పశువులంకాదు. అవి కూడా మనకంటే దయార్ద్ర హృదయం గలవే అని పిస్తున్నది నాకిప్పుడు. ఇంతచిన్నతనంలోనే ఈ హింసా దృష్టి యెందు కలవడింది మీకు? తప్పని తోచటం లేదా? కాస్త ఆలోచించండయ్యా తమ్ముళ్ళూ" అన్నా గుండెలో నించి ఉబికివచ్చే ఉద్రేకంతో తీవ్రతను ఉగ్గంటుకుంటూ. అక్కడ చేరిన పిల్లల్ని ఉద్దేశించి.

కొందరు సిగ్గుపడి తలలు వంచుకున్నారు.

మరి కొందరు నవ్వారు. "ఆఁ ఈ టీచరు ఇంతేరా. ఎప్పుడూ యిలాంటి మాటలే చెప్తుంటుందిట. మనం పోదాంపదండి" అని కొందరు వెళ్ళిపోయారు.

ఇంతలో థర్డ్‌బెల్ గణగణమన్నది. ఉలిక్కిపడి క్లాసుకు వెళ్ళి పోయిన్నాను.

ఆ మర్నాడు టీచర్స్ రూంలో కూచుని కాంపోజిషన్ బుక్స్ దిద్దు కుంటున్నాను. గబగబా వచ్చాడు రఘు.

"నేను చచ్చిపోతా టీచర్...!" అని అన్నాడు.

పరధ్యానంలో వున్న నేను విన్పించుకోలేదు.

ఈసారి ఇంకాస్త గట్టిగా అన్నాడు అదే మాట.

ఉలిక్కిపడి "ఏమి మాటయ్యా అది-మంచివాడివేలే ఏమొచ్చిపడిం దిప్పుడు?" అని అడిగాను.

"ఆఁ వాసు లేడండీ. వాళ్ళ నాన్న మా నాన్న పనిచేసే కంపెనీకి అధికారిటండీ. నేను వాసుని కొట్టానని మా నాన్నను ఉద్యోగంలోంచి తీసే స్తామన్నారుట. మా నాన్న బతిమాలుకుంటే ఈ సారికి వుంచారుట. 'వాళ్ళ బ్బాయిని కొడతావుట్రా నువ్వు. నీ మూలంగా నాఉద్యోగం పోయేది. ఇంటిల్లిపాది అడుక్కుతినాల్సి వచ్చేది కదరా వెధవా!. అని మా నాన్న కొట్టారండీ. పైగా 'పో చావు వెధవా! పీడా వదులుతుంది'. అన్నారండీ అందుకే చచ్చిపోదామని మీకొక్కళ్ళకే చెప్తున్నా టీచర్. నేను చచ్చి పోతాను" అని అంటూ కళ్ళు తుడుచుకున్నాడు.

"ఛా! అట్లా అనకూడదు. నువ్వు చచ్చిపోతే ఎట్లా? నాకేం తోస్తుంది, నేనెంత ఏడుస్తానో తెలుసా?" అన్నా జాలిగా చూస్తూ.

"మీరా మీరు ఏడుస్తారా టీచర్. నేను చచ్చిపోతే ఉహుఁ. అయితే చచ్చిపోను. చచ్చిపోనేపోను. మీ రెప్పుడూ ఇట్లా నవ్వుతుంటేనే బావుం టుంది" అన్నాడు ఆదుర్దాగా.

అతని ఆదుర్దాకి అతని మాటలకీ అతని ఆపేక్షకీ నా పెదాలమీద తృప్తి పూర్వకమైన మందహాసం మెరిసింది.

ఆ మధ్యాహ్నం ఖాళీ పీరియడుంటే గోపాలకృష్ణను వెతికిపట్టు కున్నాను.

"మేష్టారూ! రాఘవేంద్రరావుకు పునర్జన్మ ప్రసాదించటానికి మీ సాయం కావాలి. అతడిని విజ్ఞానవంతుడ్ని చెయ్యాలి" అన్నాను.

"తప్పకుండా' అన్నాడతను. అతని కళ్ళెప్పుడూ నవ్వుతూనేవుంటై. ఇప్పుడు ఇంకొంచెం నవ్వినట్లు కన్పించినై.

"ఎలా? ఏం చెయ్యాలో అర్థంకావటం లేదు మేష్టారు! అతడిని అసలు బాగుచెయ్యగలమంటారా?' అని అవేదన పడ్డాను.

"చూద్దాం అతణ్ణి ఉత్తేజపరిచి, శక్తివంచనలేకుండా ప్రోత్సహిద్దాం. సహాయపడదాం. ఫలితం దేవుడికి వదిలేద్దాం. సరేనా మిత్రా?" అన్నాడతను.

ఎందుకోగాని అతని మాటలు నాకు కొండంత ధైర్యానిచ్చాయి. రఘు కుటుంబం విషయాలు నాకు తెలిసినంత వరకూ చెప్పేశా అతనితో.

"సరేనండీ—అతన్నొకసారి డాక్టర్ దగ్గిరికి తీసుకెళ్దాం. ముందు మన హెచ్. యమ్. కూడ సహాయపడుదురు గానీ; తప్పనిసరిగా వాసూ వాళ్ళ ఫాదర్‌కి భయపడతారు. అంచేత ఆయన ఆశవదిలేసుకోవటం మంచిది. ముందతని నిరుత్సాహాన్ని పోగొట్టి ధైర్యం కలిగించటమే మనం చెయ్యాల్సిన పని" అన్నాడతను.

నాలుగురోజులు గడిచాక - ఒక సాయంత్రం— రఘుని వెంటబెట్టుకుని మా ఇంటికి తీసుకువెళ్ళాను. వాళ్ళిల్లుకూడా మా ఇంటికి దగ్గిరేట.

మా తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ అంతా అతన్ని పలకరించి సరదాగా కబుర్లు చెపుతూ కూచున్నారు. ఆ పిల్లవాడి మొహంలో మునుపెన్నడూ లేని వింతవికాసం కనిపిస్తుంటే నాకు కనుల పండుగే అయింది.

అమ్మ చేసిన టిఫెన్ పెట్టి, హార్లిక్స్ కలిపి ఇచ్చాను.

"వద్దు-వద్దండి-అమ్మో-నేను తింటే ఇంకేమైనా వుందా? ఇంకా పిచ్చెక్కివై పోతుంది గా" అని గాభరాపడ్డాడు రఘు.

"ఎవరు చెప్పారయ్యా! అలాగని"అని అడిగా చిన్నగా నవ్వుతూ-

"అప్పుడొకసారి మా అన్నయ్య అప్పచ్చులు తింటూవుంటే—పెట్ట మని అడిగితే చెప్పాడు."

"నేను టీచర్నికదా, మీ అన్నయ్యకంటే పెద్దదాన్ని—నేను చెప్పి నప్పుడు తింటే ఏంకాదు" అని అన్నాను అనునయింగా.

నా వంక ఒక్క క్షణం చూసి ఆవురావురుమని తినెయ్యడం మొదలు పెట్టాడు.

నా గుండె జాలితో, ఏదో తెలీని నిర్వేదంతో, ఏమీ చెయ్యలేని అశక్తతతో, ఏదో చేసెయ్యాలన్న తపనతో కొట్టుకుంది.

"సరేగాని స్కూల్లో పిల్లలుగాని, ఇరుగుపొరుగు పిల్లలుగాని నిన్ను వెక్కిరిస్తే పట్టించుకోకుండా ఎందుకుండ లేవు?" అని అడిగా నెమ్మదిగా.

"ఊం". అని గునిసి వాళ్ళెందుకు వెక్కిరించాలిమరి" అన్నాడు.

"పిచ్చివాడివేం కాదు నువ్వు-మొన్న మనం డాక్టరు దగ్గరికి వెళ్ళి నప్పుడు ఏమన్నారు ఆయన—నీ బుద్ధి వికసిస్తుందనలేదా? మరింకేం! ఒకళ్ళతో మనకెందుకుగాని నా మాటొకటి వింటావా?" అని ఆర్ద్రంగా అడిగాను—

కుతూహలంగా తల వూపాడతను వింటానన్నట్లు—

"నువ్వు చాలా తెలివైనవాడివి— క్లాసులో చాలామందికంటే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఫీలవకుండావుంటే = నీకే మంచి మార్కులు వస్తాయి బాబూ! చదువుకోక, చదువుకోమని ప్రోత్సహించేవాళ్ళులేక, చదువుకునే అవకాశంలేక నువ్విలా వెనకబడివున్నావు అంతే. అందరూ నీ మనస్సులో నువ్వు పిచ్చి వాడివన్న భావం నాటారు. అంతేగాని నువ్వసలు పిచ్చివాడివికాదు. నీ తెలివి తేటలు నీకు తెలియవు. నేను చెప్తున్నానయ్యా! నన్ను నమ్ము" అంటూ ఆగాను. అతని మొహంలోని భావాలు చూద్దామని.

నమ్మలేని నిజం విన్నట్లు రఘు మొహం ఉజ్వలంగా వుంది. రెట్టించిన ఉత్సాహంతో నా కృషి మీద పూర్ణాశతో మళ్ళీ మొదలు పెట్టాను.

"నేను చెప్పినట్లువింటే నీకు మంచి మార్కులు వస్తాయి. అప్పుడు అందరూ నిన్ను పొగడుతారు తెలుసా—మనుషులంటే ఏమనుకున్నావు మరి? అంతేనయ్యా. ఏ ఎండకా గొడుగు పట్టడం వాళ్ళ జీవలక్షణం. ఇప్పుడు వెక్కిరించిన వాళ్ళే నీ చుట్టూ తిరుగుతారు. ఇప్పుడు నిన్నూ, నీ స్నేహాన్నీ, బంగారంలాంటి నీ మనస్సునీ ఇంత అసహ్యించుకుని హింసపెట్టిన వాళ్ళే-రేపు భజన చేస్తూ నీ చుట్టూ మూగుతారు. నవ్విన నాపచేను పండకపోదు. మీ ఇంట్లో వాళ్ళు కూడా నిన్ను గౌరవిస్తారప్పుడు. ఇంత నీచంగా చూడరు."

"టీచర్! టీచర్! నేను ఏడో క్లాసు నిజంగా పాసవుతానా అండీ? మా తమ్ముడేమో ఎనిమిదో క్లాసు చదువుతున్నాడు. పై సంవత్సరానికి నీ పుస్తకాలట్టే పెట్టరా నాక్కావాలి అంటే వాడు పందెం వేశాడండీ— "నువ్వు పాసవలేవు ఏడో క్లాసు అని. మరయితే నేను పిచ్చాణ్ణి కాదా

టీచర్? నేను అన్నీ తినచ్చా? అందరిలా వుండచ్చా" సంభ్రమంగా సంతో షంగా—అడిగాడతను.

"కాదు— నువ్వు పిచ్చివాడివికాదు. అందరితో హాయిగా వుండ వచ్చు.

"అయితే మీరేం చెయ్యమంటే అది చేస్తాను టీచర్"

"నిన్నెవరు హేళనచేసినా పట్టించుకోకు. వాళ్ళు నడుంమీద చెయ్యే సుకుంటే నీకేదో అసహనం. కోపం. ఇర్రిటేషన్ కలుగుతున్నాయి కదూ —దానితో నువ్వు రెచ్చిపోతున్నావు. అసహాయుడివైన నిన్నలా ఉడికిం చటం వాళ్ళకి తమాషాగా సరదాగా వుంది. అందుచేత నువ్వసలు చలిం చకూడదు. నిబ్బరంగా వుండాలి ఒక్క వారంరోజులు, లేదా పదిరోజులు నిగ్రహించుకో చాలు. తర్వాత వాళ్ళకే విసుగు పుట్టి మానేస్తారు. అలా వుండడం కష్టమే అనుకో. అయినా ప్రయత్నిస్తే వుండచ్చు. వాళ్ళ చెయ్యి నడుమే నొప్పెట్టనీ—

"రోజూ చక్కగా ఒళ్ళు రుద్దుకుని స్నానంచెయ్యి. శుభ్రంగా ఉతి కిన బట్టలు కట్టుకో. తల దువ్వుకో. దేవుటికి దణ్ణం పెట్టుకో. ఏ రోజు పాఠం ఆ రోజు చదువుకో. ముందు క్లాసులో చెప్పే పాఠాలు జాగ్రత్తగా షాలో కావాలి. తెలీకపోతే ఆ టీచర్ల నడుగు-ఇంకా ఏం కావల్సివచ్చినా మా ఇంటికి రా. లేదా గోపాలకృష్ణ గారింటికి వెళ్ళు. క్లాసులో బోధపడని విషయాలూ, జీవితానికీ—ప్రపంచానికీ సంబంధించినవీ, మాకు తెలిసి నంతవరకూ నీ అభివృద్ధికి అవసరం. అయినంతవరకూ చెప్తుంటాం. నన్నెట్లా అనుకుంటున్నావో. గోపాలకృష్ణగార్ని అట్లాగే అనుకో. ఇతర పిల్లలతో ఆడుకుంటే వాళ్ళు ఏదో విధంగా నీ మనసు నొప్పిస్తారు. వాళ్ల

జోలికి వెళ్ళకు పిలిచినా. మా ఇంటికి రా. మా వాళ్ళు నీ కింకా చక్కని మంచి కథలు చెప్తారు—ఆటలు నేర్పుతారు— ఏం" అన్నాను.

"మరి—మరి ఇంట్లోపనో!"

"నీ చదువుకి అడ్డంరాకుండావుండే మటుకే చెయ్యి. మిగతా అప్పుడు చెయ్యమంటే నేను చదువుకోవాలమ్మా, ఈ ఏడు పాస్ కావాలి. ఇంట్లో పిల్లలమందరం చెయ్యాలిగాని, అంత పనీ నే నొక్కడ్నే చేస్తే నా చదువు అసలు సాగటంల్లేదు అని నిర్భయంగా చెప్పు. ఎవరు తిట్టినా ఆక్రోషపడకు. వాళ్ళ ప్రయోజనం కోసమో, ఏదో వికృతానందం కోసమో నిన్నేమైనా అన్నా క్రుంగిపోకు—చదువొక్కటే నీ ధ్యేయంగా పెట్టుకో—మంచిగా నడుచుకో. బాబూ! రఘూ! నీ కోసం బాధ్యతగల ఒక ఉపాధ్యాయునిగా నేను చెయ్యగలిగినదంతా చేస్తాను. నా మాటవిని నేను చెప్పినట్లు నడుచుకుని, ధైర్యంగా వ్యవహరించి, నాకు సంతోషాన్నే కలిగిస్తావో, నలుగురిముందరా నన్ను హేళనపాలే చేస్తావో మరి? నీ ఇష్టం. నువ్వీ నిరాశనించీ ఈ వాతావరణం నించీ బయటపడి విజయం సాధించాలోయి" అంటూ ఆశీర్వదించాను.

నా మాటలన్నీ కాకపోయినా, వాటి సారాంశమైనా అర్థమయ్యే వుంటుందతనికి. కళ్ళు విప్పార్చుకుని చూస్తుండి పోయాడు_స్తబ్ధుగా వుండే అతని కళ్ళల్లో ఏదో మెరుపు, చురుకుదనం, జ్ఞానతృష్ణ ద్యోతకం అవుతున్నై.

"నేను చెప్పిందేమన్నా అర్థమైందా రఘూ! అలా నడుచుకుంటావా మరి?" ఆశగా అడిగాను.

మంత్రముగ్ధలా తల వూపాడు. ఇన్ని మాటలు ఒక్కసారిగా బుర్రకెక్కడం కష్టం. రోజూ ధైర్యం నూరిపోస్తుండాలి. సముద్రతరణ

సందర్భంలో ఆంజనేయులవారికి చెప్పినట్లు ఈ అమాయకుడికి ధైర్యం చెప్తే- ప్రోత్సహిస్తే — జీవితంతో రాణించగలడనే ఆశ వుంది నాకు. సంపూర్ణ విశ్వాసం వుంది. డాక్టర్ మాటలూ, మా యింట్లోవాళ్ళ సహకారమూ, గోపాలకృష్ణ సహాయమూ, ఇతని విషయంలో నీకాధైర్యమిస్తున్నాయి.

"చీకటిపడుతోంది రఘూ! ఇంకయింటికెళ్ళు" అని చెప్పి "రాత్రికేం పాఠాలు చదువుతావు" అని అడిగాను.

ఆలోచిస్తూ ఆగిపోయినాడు.

ఫలాని ఫలానివి చదవమని చెప్పాను. అన్నప్రాశనలోనే ఆవకాయ పెట్టినట్లు కాకుండా కొంచెమే చదవమన్నాను ముందు.

"అలాగే టీచర్!" అంటూ రెండుచేతులూ జోడిస్తూ నిలబడ్డాడతను.

అలవోకగా మందహాసం చేస్తూ నడుముమీద చెయ్యివేసుకున్నాను నేను. అమాంతం యెవరో కొట్టినట్లు త్రుళ్ళిపడ్డాడు రఘు. గబగబా రెండడుగులు వేశాడు. అంతలోనే మెరుపు మెరిసినట్లు వెనక్కి తగ్గాడు. మళ్ళీ నావంక ఎగాదిగా చూశాడు. తీవ్రతరంగా నిగ్రహించుకునే ప్రయత్నం చేస్తూ "టీచర్" అన్నాడు దెబ్బ తిన్నట్లుగా.

చిన్నగా నవ్వి "నేను కావాలనే అట్లా చేశాను లేవయ్యా! ఎక్కడైనా సరే—ఇట్లాగే నిగ్రహంతో ప్రవర్తిస్తే అదే అలవాటైపోతుంది. ఇంకెవరూ వెక్కిరించరు నిన్ను. ప్రతిచోటా యీ సంఘటనే గుర్తుకు తెచ్చుకుంటే సరి. నీమేలు కోరి చెప్తున్నాను. సంపూర్ణ శిష్య వాత్సల్యంతో నీ అభివృద్ధికి పాటుపడతానయ్యా రాఘవేంద్రరావూ! నువ్వు, నీ తోటి విద్యార్థులు, భావిభారత పౌరులు- బాగుపడటంకంటే ఏం కావాలి ఉపాధ్యాయ వృత్తిలో వున్న నాకు? నీకు మంచి జరుగుతుంది. శుభం కలుగుతుంది. వెళ్లిరా బాబూ!" అంటూ "విజయోస్తు!" అని నిండు మనస్సుతో ఆశీర్వదించాను.

×

# స్త్రీ సాహసం

ఉదయలక్ష్మి ఇలా ఎమ్మెస్సీ ప్యాసవటమేమిటి! అలా ఉద్యోగం రావటమేమిటి ఒక్కసారే జరిగాయి. అందరూ ఆ అమ్మాయిని అదృష్ట వంతురాలనే లోగానే పెళ్ళిసంబంధం కూడా కుదిరిపోయింది, ఏదో సామెత చెప్పినట్లు.

అతగాడి నామధేయం రవి(అంటే కాబోయే పెళ్ళికొడుకు పేరన్న మాట) రెండు మూడేళ్ళనుంచీ ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తున్నాడు. కుల విద్యా రూపతరుణ్యాదుల్లన్నిటా ఉదయకు దీటైనవాడు. ఇలా అన్ని విషయాలు సమగ్రంగా కుదిరాయి గదా, పెళ్ళి యింకా అవ లేదని అడగకండి మరి. అడిగితే ఇద్దరు విలన్ల కథ చెప్పవలసి వస్తుంది. సరే కానీండి ఏం చేద్దాం మరి.

ఆ రోజు......

ఉదయ ఉద్యోగంలో చేరాక వచ్చిన మొట్ట మొదటి ఒకటోతారీఖు. తనతో కలిసి పని చేసే తరుణులతో కలిసి జీతం తీసికోవటానికి వచ్చింది ఉదయ. మొదటి జీతం పుచ్చుకోవటం గనక ఉత్సాహంగా, ఆదుర్దాగా, ఏదో ధీమాగా కూడా వుంది.

తీరా చూస్తే ఆఫీసు గదిలో సూపరింటెండెంట్ చుట్టూ కిటకిట లాడి పోతున్నారు పురుషపుంగవులు. మొత్తం మూడు వందలా ఇరవ య్యొక్కమంది ఉదోగులున్నారైరి. అందరికీ జీతమంటే సరదాయే గదా —సరదా ఏమిట్లేండి, అవసరం గదా. ఎలా మరి? అందులో ఆడవారు

నలుగురే, ఉదయా,సీతా, రాజేశ్వరీ, సుగుణ. కొంచెం దూరంగా నించున్నారు వాళ్ళు నలుగురూనూ.

పాపం సూపరింటెండెంట్‌కి ఊపిరాట్టంల్లేదు. తల ఎత్తటం అట్లా వుంచి కళ్ళెత్తి చూడటానికయినా అవకాశం లేకుండా వుంది.

"నాన్‌సెన్స్, మనకి ముందు యివ్వకూడదూ? వెళ్ళిపోదుంగదా, యీ పాటికి. అరగంటైంది వచ్చి," వాచీ చూసుకుంటూ మొహం చిట్లించింది ఉదయ.

"అంతేనమ్మా, ఉదయలక్ష్మీ! మనం చివరికి తీసుకోవలసిందే. సమాన హక్కులూ, సమాన ఉద్యోగాలు సమానంగా యిచ్చి ట్రీట్ చెయ్యటం మాత్రం అధమంగా చేస్తే సరి" కాస్త వయసు మళ్ళిన రాజేశ్వరి ఉవాచ.

ఉదయ గిలగిల లాడిపోయింది. ఉదయ చిరచిర లాడిపోయింది. ఉదయ గుబగుబ లాడిపోయింది.

తండోప తండాలుగా వచ్చి సూపరింటెండెంట్ చుట్టూ మూగుతున్నారు మగవాళ్లు. కొంతమంది లక్షణంగా జీతం తీసుకుపోతున్నారు.కాని ఎంత సేపటికి ఈ ఉద్యోగినీ చతుష్టయానికి మటుకు జీతాలు లభించటంలేదు. నుంచుని నుంచుని కాళ్ళు పడిపోతున్నయ్యి.

"దిక్కుమాలినగోల. మంచీ మర్యాదా ఏమీ లేదు. ఏం ఉద్యోగమో కాని. పోనీ రేపొచ్చి జీతం తీసుకోవచ్చునంటే వీల్లేదు. ఒకటో తారీకే తీసుకోవాలని అధికారుల ఆజ్ఞ గదా," అని ఇదైపోయింది ముగ్గురు పిల్లల తల్లి సీత.

"ఉండు! నీదంతా మరీ చోద్యం. ఆయన ముక్కుపొడమే పీలుస్తాడా? జీతాలే యిస్తాడా?" అని కోప్పడింది సుగుణ వ్యంగ్యవైభవం వొప్పారగా.

సూపరింటెండెంట్‌ని పరకాయించి చూసింది ఉదయ. సన్నగా పొడుగ్గారివటలా ఉన్నాడాయన. బట్టతల, టేబిల్ మీద ఇంద్రుడికి వజ్రాయుధం లాంటినశ్యం డబ్బి.

అంతలోనే సుతారంగా ముక్కుతిప్పి—

"నశ్యదానం మహాదానం వస్త్రదానంతు మధ్యమమ్

కనీసం కన్యాదానంచ అన్న దానం వృథావృథా, అని కవిత్వం చెప్పొట్ట ఒకాయన. ఈ బాపతు వాళ్ళని చూసేనేమో," అన్నది రాజేశ్వరి. అర్ధున్నర దాటింది.

ఉదయ కళ్ళు తిరిగినంత పనైంది. "ఇప్పుడేలా' అనుకుంటూ వాచీ చూసుకుంటోంది మాటిమాటికి.

ఎలాగయితేనేం అయిదు నిమిషాలు తక్కువ ఏడుగంటల కిచ్చారు జీతం. లెఖైనా పెట్టుకోలేదు. "నేనూ వస్తానుండు," అని సుగుణ పిలుస్తున్నా వినిపించుకోలేదు. వడివడిగా అడుగులు వేస్తూ రిక్షాకోసం చూసింది. కనుచూపు మేరలో ఎక్కడాలేదు. "ఈ రిక్షావాళ్ళందరికీ ఏమొచ్చిందో యివాళ?" అని కసిగా విసుక్కుంటూ నడక మొదలెట్టింది.

ఇంతలో బ్రహ్మాండమైన అవాంతరం ఆరడుగుల ఎత్తులో యెదురుపడింది.

"హాల్లో, ఉదయలక్ష్మిగారా? పే తీసేసుకున్నారా? గుడ్" అంటూ విష్ చేశాడు సత్యనాథం.

బిక్కచచ్చి పోయింది సదరు ఉదయలక్ష్మి. ఒక్కక్షణంలో కను బొమలు కుంచించుకు పోయాయి. మొహం నిర్జీవంగా అయిపోయింది. కాని తోటి ఉద్యోగస్థుణ్ణి పలుకరించకుండా ఎలా? ఆమె పెదవులు మెటుకు ఏదో సమాధానం చెప్పాయి.

అసలు సంగతేమిటంటే—

అతనంత దగుల్బాజీ అతనే కానీ, మరొకరుండరని ఉదయ ఉద్యోగంలోచేరిన రోజే చెప్పేశారు సుగుణావాళ్ళు.

'అతని విషయంలో జాగ్రత్తగా వుండాలి' అని నిశ్చయించుకుంది కూడా. కాని ఇదేమిటీ—

"పదండి మీ యిల్లు రామారావు పేటేకదూ? నేనూ అటే వెళ్తున్నాను. చుట్టూ రిషా అయినా లేదు. కలిసి వెళ్దాం" అన్నాడతను హీరాయిక్‌గా.

"అహఁహఁ ఎందుకూ—మీకు శ్రమ. నేను వెళ్తానులెండి. అబ్బె-మీరు రావక్ఖర్లేదు" అని ఖంగారు పడిపోయింది ఉదయ.

"నో నో! నాకేంశ్రమ! అయినా ఇంటికెళ్ళకుండా ఆఫీసులోనే వుండిపొమ్మనేటట్టున్నారు మీ వాలకం చూస్తే," అంటూ నవ్వాడతను.

"మీ యిల్లుకూడా అటేనా?" అనడిగింది ఉదయ. ఇంక ఈ తద్దినం తప్పదు గాబోలు అనుకుంటూ.

"అవును. అటే. కాకపోతేమటుకు కాస్తతోడు రాలేననుకున్నారా? కోలీగ్స్ దగ్గిర అంత మొహమాటం పనికిరాదు. ఇప్పుడెంతైందనీ మీఉద్దేశ్యం? సెవెన్ దాటింది. పైగా అమావాశ్య—ఒక్కరూ వెళ్తానంటారా?

బలేవారే!" స్నేహవిచ్చలమైన కంఠస్వరానికి కాస్త మందలింపు కూడా జోడించాడు.

అదేమిటో శాపం పెట్టినట్లు ఒక్క రిక్షా అయినా దొరకలేదు. "ఏమండి! నేనంటే అందరికీ ఎందుకండీ అసహ్యం? గిట్టనివాళ్లు లేనిపోని వదంతులు పుట్టిస్తే విద్యావంతులు గదా వీళ్ళందరూ నమ్మెయ్యటమేనా? వాటిల్లో ఎంత నిజముందో తెలుసుకోనక్కర్లేదా? అలా గుడ్డిగా నమ్మెయ్యటమేనా?" అంటూ ఆవేదనతో ప్రశ్నించాడు సత్యనాథం. తన మాటలు ఆ కన్యాలలామ చెవుల్లో జొరబడిన చిహ్నాలేం కనిపించటల్లేదు. ఉసూరు మంటూ మళ్ళీ అడిగాడు.

"ఆఁ ఏమిటంటున్నారు?" అని ఉలిక్కిపడిందామె.

"అదేనండీ, అలా నమ్మెయ్యటమేనా? అని అడుగుతున్నా" అన్నాడు.

"ఆఁ నమ్మొచ్చు. ఫర్లేదు" అన్నది సీరియస్‌గా.

"ఏమిటండీ! నా మాట మీరు వింటున్నారా అసలు?" చిన్నబుచ్చుకున్నాడతను.

"సారీ అండీ. యేదో ఆలోచిస్తూ వినలేదు." అని మళ్ళీ చెప్పించుకుంది. తప్పని సరై యేదో మాట్లాడుతోందే కాని—తనకోసం ఆత్రంగా నిరీక్షిస్తున్న రవిమొహమే మనస్సులో మెదులుతున్నది.

"ఇవాళ అక్కయ్య వస్తోంది ఉదయా! అమ్మా, నాన్నా, అత్తయ్యా వాళ్ళంతా నిన్ను చూశారు గానీ అక్కయ్య చూడలేదుగా. సాయంత్రం మీ యింటికి తీసుకువస్తున్నా. ఏవో లాంఛనాలూగట్రా అడగాలిట తను. అక్కయ్యనీ మీ పెద్దవాళ్ళనీ ఖబుర్లలోకివదిలి ఏ పిక్చర్‌కో, షైర్‌కో

చెక్కేద్దాం. మనం. ఏం! మేము వచ్చేసరికి అందాలరాణిలా తయారై వుండాలి. అక్కయ్య మురిసిపోవాలి," అన్నాడు రవి ఫోన్ చేసి.

'సరే' నన్నది తను ఉత్సాహంగా.

తీరాచూస్తే ఇలా అయింది. ఈ జిడ్డు వదలటంలేదు ముందు. ఖర్మ.

ఇల్లు వచ్చేసింది—గేటుదగ్గిర—

"థాంక్సండీ—నేను ఉంటానింక—"అన్నది. మళ్ళీ అతను తన వెనకే ఇంట్లోకి వస్తాడేమోనని గాభరాపడి,"మా ఇంటికీ...మా ఇంటికీ ..." అన్నది గబగబా. "ఈ సారి ఆహ్వానిస్తాను. ఇప్పుడుకాదు" అనే మాట నోటంట వచ్చేలోగానే అతను కళ్ళింతలు చేసుకుని, "వస్తాను. పదండి. నాకేం అభ్యంతరం లేదు" అంటూ ముందుకు అడుగు వేశాడు.

"అబ్బే—అది కాదు. ఇప్పుడే మా యింటికి...—" అని నీళ్ళు నములుతూ "దేనికి?" అనే చివరిముక్క పూర్తి చేయలేక పోయింది.

"ఓ యస్-మీ మాటకాదననంటున్నా గదా. ఇప్పుడే వస్తున్నా" అంటూ లోపలికి వచ్చేశాడతను.

ఉదయకు ముచ్చెమటలు పోశాయి.

ముందు హాల్లోనే తల్లీ తండ్రీ రవీ అతని అక్కయ్యా కూర్చుని వున్నారు. ఉదయను చూస్తునే "ఓహో"అంటూ ఏదో పలకరించబోయిన రవి, వెనకాలే వస్తున్న సత్యనాథాన్ని చూసి కుప్పకూలి పోయాడు. ప్రశ్నార్థకంగా చూసారు తల్లీ తండ్రీ.

రవి అక్కయ్య మొహం ముడుచుకుంది. సత్యనాథాన్ని పరిచయం చేసింది ఉదయ. తప్పుతుందామరి?

రెండు నిమిషాలంటే రెండే నిమిషాలు కూర్చుని లేచాడు సత్యనాథం-"వస్తానండీ, మీ అమ్మాయి చాలా కష్టపడ్డారివాళ" అన్నాడు.

"ఎందుకో? మీతో మాట్లాడి కష్టపడిందా!" అన్నాడు రవి అందుకుని. "పోనీ అలాగే అనుకోండి"అంటూ నవ్వాడు సత్యనాథం.రవి ఎవరో సరిగా తెలియలేదతనికి.

రవీ,అతని అక్కయ్య కూడా వెళ్తామన్నారు.

"ఆదేమిటి? అప్పుడేనా?"అని ఆశ్చర్యపోయి ఇంకాసేపు ఉండమని రవి అక్కయ్యను బ్రతిమలాడి భంగపడింది ఉదయ.

"అన్నట్లు మా ఇల్లు చూసి వెళ్దురుగాని రండి"అంటూ రవి అక్కయ్యను లోపలికి తీసుకొని వెళ్ళారు ఉదయ తల్లి దండ్రులు.

"సారీ రవీ! ఎంత ప్రయత్నించినా ముందు రాలేకపోయాను. పైగా ఆలస్యమై పోయింది. కారణాలన్నీ చెప్తానేం అంటోంది ఉదయ.

"నాకేం చెప్పఖ్ఖర్లేదు. ఆ సత్యనాథంలాంటి పరమ దగుల్బాజీతో కలిసి ఆఫీసు విడిచిపెట్టిన మూడు గంటలకి-ఇంతరాత్రివేళ వచ్చేవంటేనే అర్థమవుతోంది .హుఁ నేనెంత చెప్పాను పొద్దున్న? అంత లెఖ్ఖలేదన్న మాట నేనంటే-మా అక్కయ్య ముందు నా పరువు తీసేసావు,"అన్నాడు అతను కోపంగా. అప్పుడే ఉదయ తన భార్య అయిపోయినంత దర్జాగా.

ఉదయకు ఆవేశం ముంచుకొచ్చింది. రాదామరి!"ఉహుఁ అలాగేం నన్ను బాగా అర్థంచేసుకున్నారు. కానీ ఆ సత్యనాథం చెడ్డవాడని మీకెలా తెలిసిందో?" అని అడిగింది సూటిగా.

"తెలియడానికేం? ఎవరైన చెప్తారు. సచ్ ఎ నొటోరియస్ పెర్సన్ హి ఈజ్" అన్నాడు రవి.

ఒహో. చెప్పడు మాటలవల్ల తెలిసిన పెద్దతనమే నన్నమాట అత నిది. చాలా సంతోషం తమరి పరిశీలనాసక్తికి" వ్యంగ్యం ఒలకబోసింది. ఉదయ.

"ఏమోగానీ-నువ్విలా అడ్డమైన వాళ్ళతో తిరగటం, ఆఫీసు వది. లాక ఆరుగంటలకి ఇంటికి రావటం,పైగా ఇలాంటి ఎదురు సమాధానాలు చెప్పినన్ను కించపరచటం నేను సహించలేను.కాబోయే భర్త అన్న జ్ఞానం కూడా లేకుండా ఇంత నిర్లక్ష్యంగాప్రవర్తించటమంటే నాకు తగని అస. హ్యం" అంటూ నుంచున్నాడు రవి.

"ఆగండి" భద్రకాళిలా గర్జించింది ఉదయ.

అప్రయత్నంగా కలవరపడ్డాడతను.

"సంపాదించి పెట్టటానికి నాఉద్యోగమూ, నలుగుర్లో గొప్ప చెప్పు. కోవటానికి నా చదువూ కావాల్సి వచ్చాయా మహాశయా! అత్యవసర పరి. స్థితుల్లో, తప్పనిసరి అయినప్పుడు తోటి ఉద్యోగులతో మాట్లాడడం అంత నేరమా? ఏం మీరు తోటిస్టాఫ్‌తో, లేడీ స్టూడెంట్లతో మాట్లాడకుండానే పాఠాలు చెప్తున్నారా? పైగా నేను మిమ్మల్ని నిర్లక్ష్యం చేస్తున్నానని అప. వాదుఒకటా? కాబోయే భర్తట, కాబోయే భర్త. ఇప్పుడే యింత అదుపు. పెడుతున్నారే ఇంక పెళ్ళైతే ఎంత అవస్థపెడుదురో. అయ్యో! వయో ముఖ విషకుంభమా! సెలవు. మీ సంస్కారానికి సహృదయతకి నా ఒళ్లు. పులకరిస్తోంది స్వామీ! ఇంక దయచెయ్యొచ్చు తమరు" అంటూ కళ్ళ నించి విస్ఫులింగాలు రాల్తూంటే వాకిలి చూపించింది ఉదయ.

ఆ యువతి వాగ్బాణాలకు అతని అహంభావం తూట్లు పడింది.. అయినా బింకం సడలనీయకుండా—

"అయితే పెళ్ళయాక కూడా ఇలాగే ఎదిరిస్తావా? ఎలా ఎదిరిస్తావో నేను చూస్తాను" అంటూ పళ్ళుకొరికాడు.

కిలకిలా నవ్వింది ఉదయ.

"మంగమ్మ శపథం చేస్తున్నారా రవి ప్రసాద్! ప్చ్. ఏం చేసినా లాభం మటుకులేదు. ఊఁ తమరింక వేంచేయవచ్చు" అన్నది.

"బాగా ఆలోచించుకునే అంటున్నావా ఉదయా! నిజంగా నన్ను వెళ్ళి పొమ్మనే అంటావా?" అని జాలిగా అడిగాడతను. నిజానికి అతని అవస్థ వర్ణనాతీతంగావుంది. ఆమె లేనిది అతను నిలువలేడు. కానీ ఆమె మటుకు అణిగి మణిగి తన చరణదాసిగా వుండాలి.

ఆమె ధైర్యం చూసి నీళ్ళుగారిపోయాడు — ఇలా అని తెలిస్తే అసలు మందలించకనే పోను ప్రస్తుతానికి. పెళ్లంటూ అయిన తర్వాత ఎలాగూ తన మాటవినేదే చచ్చినట్లు అని లోలోపలే తన బుద్ధి తక్కువను నిందించుకున్నాడు. తన తొందరపాటుకు బాధ పడ్డాడు. పాపం రవి ప్రసాద్!

"మహారాజుగా వెళ్ళిపొమ్మంటున్నాను, కాబోయిన భర్తగారూ! పెళ్ళైన తర్వాత మీనైజగుణం తెలిసినా- క్షణం కూడా సంసారం చేసే ధాన్ని కాదు మీతో, ఏమనుకుంటున్నారో గాని. అట్టాంటిది పెళ్ళికాక ముందు- మహోదాత్త గుణప్రపూర్ణుల్ని మిమ్మల్ని వెళ్ళిపొమ్మనక ఏమంటాను? ఇంకెప్పుడూ మా యింటికి రాకండి- సత్యనాథం, సూపరించెం డెంట్ల పుణ్యమా అని బ్రహ్మాండమైన ఆపద తప్పిపోయింది నాకు. పెళ్ళి కాకపోతే పీడాపోయెగానీ" అంటూ తృప్తిగా నిశ్వసించింది ఉదయ.

అంచచలమైన ఆత్మస్థయిర్యం వెల్లివిరుస్తున్న ఆమె కనుదోయిని చూచి కళవరపడ్డాడతను.

ఇహ ఒక్కటే మార్గముంది ఉదయ తనకు దక్కాలంటే, అదే అవలంబించాడు. "క్షమించు ఉదయః జరిగింది మర్చిపో- నీలో నాకు నమ్మకం వుంది. తొందరపడ్డాను. అంతే..." అన్నాడు పశ్చాత్తాపంగా ముహం పెట్టి.

"అందితే జుట్టూ-అందకపోతేకాళ్ళూ, అంతేగదూ రవీః ఈ కల్ల బొల్లి మాటలకు నేనేం కరిగిపోను. మైనపు బొమ్మను కాను. క్షమించట మనే పెద్ద మాట వాడవద్దు-మీమీద నాకు పుష్కలంగా జాలి వుంది. కానీ మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేను—కనక..."

"ఈ స్త్రీ హృదయం కుసుమకోమలం కాదు. కఠినపాషాణంలా వుందే-వారెలా ఇలా ఎక్కడైనా వుంటారా ఆడపిల్లలు? ఇంతకు నేను లేచిన వేళ మంచిది కాదు." అనుకున్నాడు రవి హతాశుడైపోయి— ఇంతకూ కారణం అసత్యానాధం, ఆ రోగ్-వాడూ కారణం-ఆడపిల్లల హృదయాలు దోచుకునే అందం వాడిది అని స్ఫురించింది.

కసిగా చూశాడు ఆమె వంక.

"ఇంత డొంక తిరుగుడు దేనికి? సత్యనాధాన్ని పెళ్ళి చేసుకోవాల నుకుంటున్నాను, అని చెప్పెయ్యరాదూ? అన్నాడు.

పాము బుసకొట్టినట్లు విన్పించి ఉలిక్కి పడింది ఉదయలక్ష్మి. అంతలోనే నిబ్బరం తెచ్చుకుని అన్నది.

"ఏరే అదే నేనూ అనుకుంటున్నాను. అయినా నేను సత్యనాధాన్నే పెళ్లాడుతానో, సుబ్బరామయ్యనే పెళ్ళాడుతానో మీ కెందుకు చెప్పండి, లేనిపోని ఇంట్రెస్ట్ తప్ప. అసలు ఆ సత్యనాధంలో వున్న దోషమేమిటో నా కర్ధంకాదు. ఎంత చెడ్డవాడైనా మీకుంటే చెడ్డవాడని నే

ననుకోను. ఒక మాట. మూఢ విశ్వాసాలు నేను నమ్మను. నా అభిప్రాయా
లకు విలువ ఇచ్చి నన్ను మనిషిగా, తోటి ప్రాణిగా చూసే వ్యక్తిని నేను
ప్రాణాధికంగా ప్రేమిస్తాను. దేవుడుగా ఆరాధిస్తాను. అట్లా కాని వాళ్ళని...
అర్థమయింది కదూ రవిప్రసాద్! నా మనసుకి నచ్చిన వ్యక్తి తటస్థపడే
దాకా పెళ్ళికేం తొందరలేదు. సంఘం మాటలకు నేను జడవనని తెలిసిం
దనుకుంటాను. ఇంక సెలవు, వెళ్ళిరండి గుడ్‌బై!" అంటూ గబగబా
లోపలికి వెళ్ళిపోయింది నూరుపైసల ఆధునిక స్త్రీ ఉదయలక్ష్మి.

# రావుగారి రిటైర్‌మెంట్

సూర్యప్రకాశరావుగారు ఒక ఆఫీసులో సూపరింటెండెంట్‌గా పని చేస్తున్నారు. యథాప్రకారం నలుగురు ఆడపిల్లల్నీ, ఇద్దరు మగపిల్లల్నీ, ఇల్లాల్నీ పోషించారాయన. పెద్దపిల్ల లక్ష్మి పెళ్ళి అయిందనిపించేటప్పటికి తాతలు దిగివచ్చారు. మిగతా అయిదుగురు పిల్లల చదువులూ, పెళ్ళిళ్ళూ ఏమీ పూర్తికాలేదు. రావుగారు రిటైరయ్యే టైము వచ్చేసింది.

పైకి స్పష్టంగా చెప్పకపోయినా ఇంట్లో అందరికీ దాదాపు అదే దిగులుంది కడుపునిండా. ఎలాగ భవిష్యత్తు? ఏమిటి కర్తవ్యం? ఏదో విధంగా తమ భావిని తామే నిర్ణయించుకోకపోతే గత్యంతరం లేదని అనుకుంటున్నారు.

రెండో అమ్మాయి సుగుణ బియ్యే ఫైనలియర్‌లోకి వచ్చింది ఈ సంవత్సరమే. ఆ అమ్మాయి తరవాత రామకృష్ణ. రెండో సంవత్సరం మెడిసిన్ చదువుతున్నాడు వైజాగ్‌లో హాస్టల్లో ఉంటూ. తరవాత పిల్ల నళిని ఫస్ట్ బి.ఎస్సీ. తరువాతిది కాంతి ఇంటర్‌లో జాయినయింది. చివరివాడు మగపిల్లవాడు చిత్కళామోహన్—ముద్దుగా 'శివుడ'ని పిలుస్తారు వాణ్ణి. టెన్త్‌క్లాసు చదువుతున్నాడు. అంతా చదువుతున్నవాళ్ళే కానీ ఉద్యోగంలో చేరి తండ్రి చేతికి అందివచ్చిన పిల్లలు లేరు.

ఎస్సెల్సీతో ఆపుచేసి లక్ష్మికి పెళ్ళిచేశారు. పోనీ ఆ పిల్లయినా సుఖంగా కాపురం చేసుకుంటూంది-దాని బాధ్యత వదిలింది అనుకోవటానికి లేదు. ఆమె భర్త జగన్నాధానిది అదోరకమైన మనస్తత్వం. తమ

గుమస్తాయే అయినా గుమస్తా కూతురిని చేసుకోవడం బొత్తిగా అసహ్యిం చుకునేవాడు. ఆశలు ఆకాశంలో విహరిస్తుండేవి పాపం అతనికి. పెళ్ళి యిన కొత్తల్లో అదే పనిగా సాధించేవాడు భార్యని. "కాస్త అందంగా అగోరించావనని, నా కోరికలన్నీ మంట గలుపుతుని నిన్ను కట్టుకున్నాను అనీ- మీనాన్న ఏం ముద్దుముచ్చట్లు తీర్చాడని— వెధవ నాలుగువేల కట్నం తప్ప. ఒక ఫానివ్వలేదు, రేడియోలేదు. ఆఖరికి వాచీకుడా లేదు పండక్కి పిలిచి ముష్టిపంచెలచాపు మొహానతగలేస్తాడు గానీ టెరీనో టెరి కాటో కాస్తమంచి బట్టలన్నా పెట్టడు" అని గిలగిలలాడగా వినీవినీ సహ జంగా కాస్త చమత్కార ధోరణిగల లక్ష్మి- "అవునండి అదేమిటో మనింట్లో కందిపప్పూ, చింతపండూ, గసగసాలూ, ఆవాలూ, జీలకర్ర, బెల్లం, ఇంగువా, అగ్గిపెట్టే ... ఏవీ ఇవ్వడేం మానాన్న!" అనేసింది.

"నన్ను ఎద్దేవా చేస్తున్నావా?" అని పెళ్ళాన్ని చితకబాదాడతను. "అవునే అన్నీ ఇవ్వాలి. ఇవ్వకేం చేస్తాడు? ఆడపిల్లని కన్నాక అన్ని వస్తువులు ఇచ్చుకోవాల్సిందే కూతురికాపరం నిలబడాలంటే. నేను మగాణ్ణి అల్లుణ్నే. అల్లుడంటే ఏమిటనుకున్నావ్?" అని అరిచాడు మరొక సాధిం పులో.

"బాగాఉంది మీరు మగవాళ్ళే. అల్లుళ్ళే. నేను కాదనటంలేదు సరి గదా ఆ సంగతి ఆనందంగా ఒప్పుకుంటున్నాను. కానీ రేపు మీకు ఆడ పిల్లలు పుడితే వాళ్ళిళ్ళకీ కందిపప్పు, చింతపండూ, సరఫరా చేస్తారన్న మాట" అంది లక్ష్మి.

"హ్యు. ఏమనుకుంటున్నావో—నాకసలు ఆడపిల్లలే పుట్టరు" అని చాలెంజి చేశాడు జగన్నాధం. కానీ, అతని కప్పుడు వరసగా ఆడ పిల్లలే పుట్టుకొచ్చారు. అప్పట్నించీ లక్ష్మి శోభ మరింత ఎక్కువైంది. ఆడపిల్లల్ని కన్నందుకు పెళ్ళయిన పెద్దకూతురి సంసార విషయమొకటి

పుండు సలిపినట్లు సలుపుతుంటే, పెళ్ళికాని సుగుణ గుండెలమీద కుంప ట్రైకూచుంది ప్రకాశరావుగారికీ, కనకమ్మగారికీ.

ఈ మధ్యన రోజూ ఆపిల్ల కాలేజీ నుంచి ఆలస్యంగా ఇంటికి వస్తోంది. తీరా ఏ ప్రేమ వ్యవహారంలోనో పడితే...అమ్మో! ఎన్ని కథలు వింటున్నాం కాదు.

ప్రేమ పెళ్ళికి ఆ ఇంట్లో అభ్యంతరం లేదు. కానీ డబ్బులేని వాళ్ళ అమ్మాయిని ఎరరైనా సరదాకి ప్రేమిస్తారుగాని పెళ్ళి చేసుకుంటారా? అని.

ఇంకొన్నాళ్ళకి పొద్దున పూట స్పెషల్‌క్లాసు లున్నాయంటూ నళినీ, కాంతీ వెళ్ళిపోవటం మొదలు పెట్టారు. ముందుగానే తల్లి మనసు కొట్టుకు పోవటం మొదలు పెట్టింది. ఎదిగిన ముగ్గురు ఆడపిల్లలు కంటిముందర తిరుగుతుంటే ఆవిడ అన్నం సయించక, నిద్ర పట్టక బాధపడేది. పైగా ఇప్పుడీ తిరుగుళ్ళేమిటిరా భగవంతుడా! పెళ్ళిచెయ్యలేని, పెంచలేని మా లాంటి వాళ్ళకి ఇంతమంది పిల్లల్ని ఎందుకిచ్చావయ్యా?'' అని బాధపడని క్షణం లేదు.

ఆ మహారాజు మనసులో ఏమనుకుంటున్నాడో ఎంత బాధ పడు తున్నాడో తెలియదు గాని భార్య గోలపెట్టగా పెట్టగా— ఆమె ఆదుర్దాని తేలికగా కొట్టిపారేశారు ఒకనాడు. ''చదువుకునే పిల్లలకి ప్రైవేటు క్లాసు లుండవా ఏమిటి? బస్సులు సరిగా అందవద్దా, రావద్దా? వూరికే అనుమాన పడటం మంచిదికాదు. ఆడపిల్లలూ—మగపిల్లలూ అంటూ తేడాగా చూసేంత స్థితికి నువ్వెప్పుడు దిగజారావే? నా భార్యవైయుండి'' అన్నారు.

''అదికాదండీ. రోజులసలే బాగులేవు. మొన్న మన పక్క వీధి శారదాంబగారి రెండో పిల్ల కాలేజీకి వెళ్ళివస్తూంటే జడ పుచ్చులాగాడట ఏవరో అల్లరిక్రుఱ్ఱాడు'' అని బాధ పడిందావిడ.

"ఓసి పిచ్చిదానా! నేనొకటి చెప్తావిను. స్త్రీ శీలం స్త్రీయే కాపాడు కుంటున్నది కానీ పురుషుడి అండవల్లకాదని" చెప్పారే గాంధీగారు. సీత గాని, ద్రౌపదిగానీ, దమయంతి గానీ వాళ్ల శీలం వాళ్ళే కాపాడుకున్నారు గానీ రాముడు, పాండవులూ, నలుడూ కాపాడలేదన్నారు తెలుసా?" అన్నారు రావుగారు.

"నాఖర్మ-నాఖర్మ" అని నుదురుకొట్టుకుందావిడ.

అట్లా కొన్నాళ్ళు గడిచినై.

ఒక రోజు జగన్నాధం దగ్గర్నించీ ఉత్తరం వచ్చింది. లక్ష్మికి ఎబార్షన్ అయిందనీ పెద్దప్రమాదం తప్పింది కానీ ఇంకా కోలుకోలేదు-హాస్పిటల్లో ఉందనీ".

అప్పుడు ఇంట్లో రావుగారు కానీ, పిల్లలు గానీ లేరు. కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నాచుంది కనకమ్మ.

లక్ష్మికిది నాలుగో కాన్పు. మొదటి రెండు పురుళ్ళూ రావుగారే పోశారు. ఆ రెండేళ్ళూ ఆ ఖర్చులతో ఆయనకు వూపిరాడలేదు. సాంప్రదాయం ప్రకారం మూడో పురుటికి మటుకు పుట్టింటికి తీసుకురాలేదు. మేమేదో పూర్వం వాళ్ళం. పిల్లల్ని ఎక్కువ కన్నాంగాని, మీకీ పిల్లలు చాలు. ఆపరేషన్ చేయించుకోవడం మంచిదనీ అల్లుడికి బతిమాలుతూ ఉత్తరాలు రాశారాయన. ఇదిగో ఈసారి మగపిల్లాడు పుట్టాక ఆపరేషన్ అని జవాబు రాశాడతను ఏ కలలనున్నారో గాని.

మూడో పురిటికి ఇంతే- ఒక నెలాఖర్లో టెలిగ్రాం వచ్చింది—లక్ష్మికి ఇద్దరు ఆడపిల్లలు- కవలపిల్లలు పుట్టారనీ, ఆమె పరిస్థితి సీరియస్ గా ఉందనీ.

ఆ రోజు ఇంటిమొత్తం మీద నాలుగే నాలుగు రూపాయలున్నాయి. అప్పు పుట్టడానికి మహాఅవస్థ అయిందప్పుడు. ఎలాగో ఆ గండం గడిచింది. కానీ ఆపరేషనుకి ఒప్పుకోలేదు జగన్నాథం. ఒకరు కాదు ఇద్దరు కాదు, ముగ్గురుకాదు నలుగురు ఆడపిల్లలు పుట్టారు వరసగా. కానీ అత గాడు వంశోద్ధారకుడి కోసం ఎదురుచూస్తూనేఉన్నాడు. ఇంతలో ఈ ఉప ద్రవమేమిటి? అని ఆ కన్నతల్లి క్షోభ.

ముందు సుగుణ వచ్చింది ఇంటికి. ఆదుర్దాగా ఉత్తరం చూపించింది తల్లి. కాసేపటికల్లా మిగతా పిల్లలు చుట్టూచేరారు. "నలుగురు పిల్లలుచాల్లేదు గాబోలు ఈయనగారికి. ఛీ- ఈ బావకి బుద్ధిలేదు. అక్కయ్యకంతకంటే లేదు.'' అన్నదాపిల్ల విసుగ్గా.

"అవేం మాటలే. ప్రాణంమీదికొచ్చి అది ఏడుస్తుంటే. అయినా మొగుణ్ణి ఎలా ఎదురిస్తుంది అది మాత్రం. చాల్లే'' అని కోప్పడింది తల్లి బాధగా.

"సరేలే. నువ్వు ముందు బయలుదేరు. నాన్నవచ్చేసరికి ఆలస్యమవుతుందేమో. ఇంకో అరగంటలో ట్రైనుంది' అని తొందర పెట్టింది సుగుణ తల్లిని

"నీకేమన్నా మతిపోయిందంటే—డబ్బేది? ఆయన దగ్గిరైనా ఉందో, లేదో'' అని దిగులుగా చూసింది కనకమ్మ.

నవ్వింది సుగుణ.

"అదా నీ భయం? ఇదుగో ఈవంద రూపాయలు తీసుకెళ్ళు ముందు అంటూ ఇచ్చింది.

"ఎక్కడిదే తల్లీ! నీకింత డబ్బు!''అని లబలబ మొత్తుకుందావిడ.

తల్లిబాధ అప్పటికి గాని అర్ధంకాలేదామెకి. అర్ధమైన వెంటనే ఒళ్ళంతా గుగుర్పొడిచినట్లైంది.

"న్యాయంగానే సంపాదించానమ్మా! సాయంకాలం కాలేజి అయిపో యాక నలుగురు హైస్కూలు పిల్లలకి ప్రైవేటు చెప్తున్నాలే ఈ మధ్య" అని నవ్వుతూ తేల్చేసింది.

"అక్కా"

"ఏం నళినీ!

"ఇవిగో ఇవి కూడా అమ్మకియ్యి అంటూ ఏభై రూపాయలు సుగుణ చేతిలో పెట్టింది నళినీ,

కాంతి ఏం మాట్లాడకుండావచ్చి నలభై రూపాయలు అక్క చేతిలో పెట్టి పారిపోయింది.

"ఎక్కడివర్రా ఇవి? అరె—కాంతి ఉండు" అంటూ జడ పట్టుకుని ఆపింది సుగుణ.

"మరే నళిని ఎవరో రచయిత దగ్గర పొద్దున పూట ఒక గంట పని చేస్తోంది. పని అంటే ఉత్తరాలు రాయటం, కథలు ఫెయిర్ చేయటం అంతే. నెలకి 50రూ! జీతం ఇచ్చారాయన. నేనేమో చిన్న పిల్లల డ్రస్సుల మీద ఎంబ్రాయిడరీ వేస్తున్నా రోజు ఒక రెడిమేడే షాపులో" అంటున్న చిట్టి చెల్లెల్ని తనివారా కౌగిలించుకుంది సుగుణ. ఆ పిల్లలుతో పాటు,తల్లికీ కళ్ళంట నీళ్ళొచ్చినై.

"చూశావా అమ్మా! నీ పిల్లల్ని—ఆడపిల్లల్ని. అమ్మా ఇట్లాంటి ఆడ పిల్లల్నేగా చీదరించుకుంటారు బావా లాంటివాళ్ళు." సంతోషంగా ఆవేద

నగా ఉద్రేకపడింది సుగుణ. తను మెచ్చుకుంటే పిల్లలకు దిష్టి తగులు తుందేమోనని భయపడింది ఆ తల్లి.

"ఏడిశార్లే—గొప్ప. ఏ చదివూ రానిదాన్ని నేనూ సంపాదించాను. ముప్ఫయి రూపాయలు. పక్కింటావిడ దగ్గర దాచా. సమయానికి అక్కరకొస్తాయని. కానీ వేళకి ఆవిడ వూళ్ళో లేదు" అన్నది గర్వంగా—

"ఎట్లా సంపాదించావమ్మా?" సుగుణ విస్తుపోయింది. "పక్కింటి వాళ్ళింట్లో మిషనుందిగా—మధ్యాహ్నాలు వెళ్ళి చుట్టు పక్కలవాళ్ళకి బట్టలు కుట్టిపెట్టే దాన్ని. ఇంక అప్పడాలు చేసి ఆవిడ కిస్తే అమ్మించి పెట్టేది —జానకమ్మ.

పిల్లలంతా వెళ్ళి అమాంతం తల్లిని వాటేసుకున్నారు.

"ఒసీ నీ ఇల్లు బంగారంగానూ-ఎంత తెలివి మీరి పోయినావే. డబ్బు సంపాదించేస్తున్న మాట మొత్తానికి-ఇహ నీ కంటికి నేనేం ఆన తానూ?" అంటూ లోపలికొచ్చారు రావుగారు నవ్వుతూ.

చాలా రోజులకి తండ్రి మొహంలో కనిపిస్తున్న సంతోషపు ఛాయలు పిల్లలు గమనించేశారు. ఆవిడా గమనించింది.

"నా సంపాదనదేముంది కానీ—ఇదుగో మీ అమ్మాయిల సంపా దన చూద్దురూ ముందు—"అంటూ డబ్బంతా తెచ్చి భర్త చేతిలో పోసింది అంతా చెప్తూ.

"ఆణిముత్యాలు కదూ నా పిల్లలు—ఆఫీసుకి రామకృష్ణ. రాశా డివాళ—పత్రికలో తను రాసిన గేయం పడిందట—వాళ్ళిచ్చిన పారితో కంతో నాకు మంచి పెన్ను కొంటానని రాశాడు. నాకెందుకిప్పుడు? తననే

ఉంచుకోమంటాను— ప్చ్. అంతా బావున్నారుగాని సుగుణ కంటే పదేళ్ళుగా పెద్దది లక్ష్మి—దాని బతుకు చూడు."

తండ్రి మాటకి మధ్యలో అడ్డొచ్చింది సుగుణ.

"కానీ నాన్నా! అక్కయ్యకంటే మాకిప్పుడు కాస్త సాహసం, అవకాశం కొద్దోగొప్పో ప్రోత్సాహం లభిస్తున్నై గదా-కాలం మారుతోంది నాన్నా—మగపిల్లలే కాదు ఆడపిల్లలూ ఆణిముత్యాలు అని గ్రహిస్తారింక ప్రజలు. బయటి కెళ్ళి పని చేసినంత మాత్రానే ఆడపిల్ల శీలాన్ని శకించలేరింక" అంటూ.

తన ఈడుకి సహజమైన ఉద్రేకం కాస్త ఉన్నా పందొమ్మిదేళ్లకే ఇంత ఎదిగిన తన బిడ్డవైపు మురిపెంగా చూసుకుంటూ... "నా సర్వీసు ఒకటి రెండేళ్ళు పొడిగించే అవకాశాలున్నట్లు కన్పిస్తున్నై—అప్పటికి సుగుణ గ్రాడ్యుయేషన్ అయిపోతుంది—రామకృష్ణ చదువు చివరి కొస్తుంది." అన్నారు నిశ్చింతగా.

ఇంటిల్లిపాది మొహాలు పువ్వుల్లా వికసించినై గాని, లక్ష్మి విషయమే ముల్లులా అందరి మనస్సుల్లో గుచ్చుకొంటోంది.

"రాత్రికి ఎక్స్‌ప్రెస్ ఉందిగా నాన్నా! అమ్మా. నువ్వు వెళ్లి. అక్కను తీసుకురండి ఓపికరాగానే—బావగారికి నచ్చచెప్పిదాన్ని ఏదాన్నా హిందీ పరీక్షలకైనా కట్టిద్దాం—టైపు నేర్చుకున్నా ఫరవాలేదు. ఇక్కడే అక్కకు ఆపరేషన్ చేయించాలే అమ్మా— బావ ఎమన్నా అననీ—ఉన్న పిల్లలు చాల్లే—సరళనీ. రమణినీ, హైమనీ, శ్యామనీ మన శివుడు ఆడిస్తుంటాడు స్కూలునించి వచ్చాక. ఏరా శివా!" అంటూ తమ్ముణ్ణి ఆటలు పట్టించింది సుగుణ ఉత్సాహంగా.

*

# వసంత రాజీయము

"వసంతా! ఏమిటో వాసనొస్తోంది కూర-మాడుతున్నట్లుంది, చూడు చూడు." స్నానంచేసి బాత్‌రూమ్ లోనుంచి బయటికి వస్తూ అన్నాడు రాజు.

తల యెత్తకుండా వ్రాసుకు పోతోంది వసంత.

"వసంత, నిన్నేనోయ్. వంటింట్లోకి వెళ్ళిచూడు", మాడు వాసన తారస్థాయి నందుకోగా వుండబట్టలేక మళ్లీ హెచ్చరించాడు రాజు.

తలయెత్తి భర్త వంకోసారి చూసి "కథ పూర్తిగావస్తోంది. కాస్త మీరెళ్ళి ఆ కూర దింపేద్దురూ," అనేసి మళ్ళీ వ్రాసుకోవటంలో మునిగి పోయింది వసంత.

రాజుకు ఏమనాలో తోచలేదు. గప్‌చిప్‌గా వెళ్ళి స్టౌవ్ మీంచి కూర గిన్నె దింపేశాడు, ఏదో సామెత గుర్తు తెచ్చుకుంటూ.

ఆఫీసు టైమవుతోంది. కాని వసంత అన్నంపెట్టే ప్రయత్నమేమీ చేసేట్లు లేదు. "కాస్త రెస్టు తీసుకుంటూండు వసంతా-మధ్యమధ్యలో", అంటూ వసంత ముందునుంచి వంటింటి గడపదాకా రెండు మూడు సార్లు పచార్లు చేసి వచ్చాడు రాజు. అమ్మాయి ఈ మాట వినిపించుకున్న లక్షణం గాని అతని అవస్థను గమనించినట్లుగా గాని కనిపించటం లేదు.

ఇక ఉపేక్ష చేస్తే లాభం లేదనుకొని "వసంతాదేవీ, ఈ పూటకి దీనుడికి భోజనప్రాప్తిలేదా?" అన్నాడు భార్యఎదురుగా కుర్చీలోకూర్చుంటూ

ఏ కళనుందోగాని తొందరగానె పలికింది దేవి: "ఆఫీసు వేళయినట్లుంది గదూ? కొంచెం మీరే పెట్టుకొని తినేద్దురూ. ఇదిగో ఇది ఫెయిర్ చేస్తున్నాను," వ్రాత ఆపకుండానే. నిర్ఘాంత పోయాడు రాజు.

"ఏమండీ, అన్నం తిందురుగానిరండీ. ఆఫీసుకిటైమయిపోతోంది" అంటూ రోజూ బతిమలాడే వసంతేనా ఇట్లా మాట్లాడేది? తను బుజ్జగించి కొసరి కొసరి తినిపించే వసంతేనా ఈ అమ్మాయి? ఔరా కాలమహిమ. ఐనా ఒకర్నని ఎంలాభం. స్వయంకృతం-కిక్కురుమనలేదు పాపం రాజు. బరువుగా అడుగు లేసుకుంటూ వెళుతున్న భర్త వంక చూసి దీర్ఘంగా నిట్టూర్చింది వసంత. బాధతో ఆమె హృదయం గిలగిల కొట్టుకుంది. అసలేం జరిగిందంటే...

* * *

వసంత బియ్యే చదువుతూ మానేసింది-మెత్తని హృదయం, మధురమైన రూపం ఇచ్చాడు దేవుడు. రాజు బీకాం పాసై ఏదో ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. ఉంగరాల జుత్తువాడు. వూరించే కన్నుల వాడు.

వసంత రాజులది అన్యోన్యమైన దాంపత్యం - కానీ అట్లా వుంటే ఈ కథ వ్రాయాల్సిన అవసరమే లేకపోను - ఎప్పట్నుంచో రాజుకో కోరికుంది. తనభార్య రచయిత్రి కావాలని. పెళ్ళిచూపులప్పుడు వసంతను అడగనే అడిగాడు. "మీకు కథలు వ్రాయట మంటే ఇష్టమా?" అని. అసలే సిగ్గుపడుతున్న వసంత తల ఊపేసింది. 'ఫర్వాలేదు' అనుకున్నాడు రాజు.

పెళ్ళైపోయింది. నవదంపతులు కొత్తకాపురం పెట్టారు. అప్పట్నించీ భార్యను కథలు వ్రాయమని వత్తిడి చేయటం ప్రారంభించాడు రాజు.

"నేనా? కథలు వ్రాయటమా?" అని ఆశ్చర్యపోయింది వసంత మొదట్లో- "నువ్వే వసంతా! ప్రయత్నిస్తే వ్రాయలేకపోవు. లిటరేచర్ బియ్యే చదువుయు మానేశావు-నువ్వు వ్రాయలేకపోతే ఎట్లా? నువ్వు వ్రాయ గలవు నాకు తెలుసు——" అంటూ రోజుకో ప్రోత్సాహ పూర్వకమైన ఉపన్యాసం ఇచ్చేవాడు రాజు.

భర్తను ఆ ఉద్దేశం నుంచి మార్చాలని శాయశక్తులా పాటుపడింది. వసంత - నిద్రమంచం మీదినించే "వసంతా! ఇవ్వాళ తప్పకుండా కథ......" అంటూ మొదలెట్టేవాడు రాజు.

వసంత హడావిడిగా వచ్చేసి "ఏమండోయ్ ఆ మధ్య నేను గులాబీ మొక్క నాటాను గుర్తుందీ? ఇవ్వాళ అది ఇంచక్కటి పువ్వు పూసింది. చూపిస్తాను రండి". అంటూ లాక్కెళ్ళేది. ఇంకేముంది రాజు కథ మాట మర్చిపోయి గులాబీ పువ్వుకూ ప్రాణేశ్వరి( అంటే వసంత) చెక్కిళ్ళకూ గల సామ్యం గురించి ఉపన్యసించేవాడు కాస్సేపు.

ముసి ముసి నవ్వులు నవ్వుతూ కాఫీ అందించేది వసంత. భోజనం చేస్తూ, "వసంతా! మరేం కథ..." అంటూండగానే వినిపించు కోకుండా, ఇంకొంచెం కూర వెయ్యనా? ఈకూర మీ కిష్టమని ఎంతో బాగా చేశాను. బావుందా? మరైతే అంత కూరేనా ఏవిటమ్మా వేయించు కుంటారూ?. ఇంకొంచెం వేస్తాను, అంటూ మొదలెడుతుంది వసంత. ఇక రాజుకు కథ మాట గుర్తుంటుందీ? అమ్మాయి పమిటచెంగు నందుకునే వ్యాపకం తప్ప మరేది తట్టదు అతగాడికి అప్పుడు.

"ఛా! ఏమిటదీ? పసిపిల్లల్లాగా మీకింత అల్లరి తగదసలు," అంటూ అందంగా కోప్పడేది వసంత.

"ఎబ్బెబ్బె! నాదేం తప్పులేదు. నీ కొంగుదే తప్పంతా. విసురుగ్గా వచ్చి నా చేతిలో యిరుక్కుంది. నువ్వేమో నిర్దోషినైన నామీద దోషారోపణ చేస్తున్నావు," అంటూ ఊఁ ఇదై పోయేవాడు రాజు.

సాయంత్రం పూవ్వులూ, స్వీట్సూ తీసుకొని హుషారుగా యింటికొచ్చేవాడు రాజు.

అందంగా తయారై వేయికళ్ళతో ఎదురు చూస్తూండేది వసంత. భర్తకు ఎదురువెళ్ళి చిరునవ్వులు కానుక లిస్తూ, "ఏమండీ! ఇవ్వాళ మీ కోసం ఏం చేశానో చెప్పుకోండి?" అంటూ అతని బూట్లు విప్పేది-"నేను నీ కోసం ఏం తెచ్చానో చెప్పుకో మరి చూద్దాం." అంటూ పూరించేవాడు రాజు - తెచ్చిన పువ్వుల మాల తలలో అలంకరిస్తూ. "వసంతా? వసూ! డియర్! నువ్వు మంచి దానివిట. అపరంజి బొమ్మవిట; కథ వ్రాస్తావుట" అనేవాడు లాలనగా రాజు. "అదా సంగతి: ఇవన్నీ కథ వ్రాయించుకోవటానికి దోహద క్రియలాండీ? నా మీద నిజంగానే అపేక్ష వుండి పట్టుకొచ్చారేమో ననుకున్నాను," అని ముద్దుగా మూతి ముడుచుకుండేది వసంత.

అమ్మాయి అందానికి కరిగి కరిగి నీరై పోయేవాడు రాజశేఖర్. అంటే రాజు - అతని ఠీవిని చూసో ఏమోగాని అందరూ అతన్ని 'రాజు' అనే పిలుస్తారు.

"ఎంత మాటన్నావ్! ఎదీ ఒక్క కోరిక కోరుకో! తక్షణం దాన్ని తీర్చేసి నా అపేక్షనీ, నా పత్నీ భక్తిని నిరూపించుకుంటాను," అని ఓ గంభీరమైన పోజు పెట్టేసేవాడు రాజు.

"మరైతే సినిమాకి వెళదామండీ?" గోముగా అడిగేది వసంత. కాస్సేపటికల్లా వాళ్లు చిలకా గోరింకలకే వంకలు పెట్టేటంత అందంగా,

అనురాగంగా, వాత్సల్యంగా పెట్టా పట్టా చేసుకుని పక్కింటి, ఎదురింటి పడతుల కళ్ళు అసూయతో కుంచించుకు పోతుందగా సినిమా కెళ్ళిపోయే వాళ్ళు. మర్నాడు పార్కుకి, ఆ మర్నాడు పిక్నిక్కి, ఆ మర్నాడు ఫ్రెండింటికి ఇట్లా తిప్పేది వసంత రాజును.

ఇట్లా బుజ్జిపాపాయిని మురిపించినట్లు తన రాజునుకూడా ఒక్క ఆరు నెలలు మురిపించింది ఆ అమ్మాయి. తన వాక్చాతుర్యమూ, తన అమోఘమైన ప్రేమా, ఇట్లా వేస్టయి పోవడం వసంతకేం నచ్చలేదు. రాజేమో కథలు వ్రాయమనే పోరు మానలేదు. ఒక రోజు తెగేసి చెప్పా డతడు: "నువ్వు కథ వ్రాస్తేనే సాయంత్రం నీ తల్లో పువ్వులు పెడతాను లేకపోతే నువ్వే పెట్టుకోవలసి వుంటుంది," అని. "కథ వ్రాయకపోతే నీ చేత్తో కాచిన కాఫీనే త్రాగ" నన్నాడు అనక విసురుగ్గా ఆఫీసు కెళ్ళి పోయాడు.

ఈ దెబ్బతో పూర్తిగ బెంబేలు పడిపోయింది వసంత. మరీ ఇంత పెద్ద శిక్షా! ఎంత ఇదైతే మాత్రం! ఆయన మటుకు ఎంత కోపం రాక పోతే ఇట్లా అంటారు. నేను కథలు వ్రాయాలని ఎంతగా ఉబలాటపడ్డారో పాపం. భారత నారీ ధర్మం ప్రకారం ఆయన కోరిక తీర్చటానికి అశక్తు రాల్నైపోయాను నేను. భగవంతుడా! నాకు కథలు వ్రాయటమైనా వచ్చేట్లు చెయ్యి లేదా ఆయన కి కథల పిచ్చైనా వదిలించు – వేంకటేశ్వరస్వామీ! రేపు శనివారం రెండు కొబ్బరికాయలు కొడతాను. నా కాపరం పాడు చెయ్యకు," అని తెగబాధపడిపోతూ వేడుకుంది వసంత. ఇంతలో "వసంతా? ఏం చేస్తున్నావ్? మీ శ్రీవారు ఆఫీసుకు వేం చేసినారా?" అంటూ ఉత్సాహంగా లోపలికి ప్రవేశించిన జానకి విస్తుపోయి నుంచుంది రెండు క్షణాలపాటు. అందుకు కారణం ఒకటికాదు చాలా ఉన్నై. వసంత

చెక్కిట చెయ్యీ, కంటనీరూ, ఎదురుగుండా కాయితాలూ కలమూ కారణాలు. జానకి వసంత ప్రాణ స్నేహితురాలు, హైస్కూలు టీచరు

జానకిని చూడగానే వసంత దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించింది. "అయ్యయ్యో ఏమైంది వసూ! మీ రాజు గారు చాలా చాలా మంచి వారు గదా! నీ సుఖం చూసి అసూయపడిపోయి ఏ దేవతలో గంధర్వులో శాపం పెట్టేయలేదు గదా?" ఆపేక్షతో ఓదారుస్తూ అడిగింది జానకి.

సిగ్గుపడుతూనే జరిగిన సంగతి చెప్పింది వసంత. "ఓస్! ఇంతేనా! విసూ! నువ్వు నాటకాల్లో వేశావు గదూ," అంటూ ఉత్సాహంగా అడిగింది జానకి.

కథలు వ్రాయడానికీ నాటకాల్లో వేషం వేయడానికీ ఏం సంబంధమో అస్సలు అర్థంకాలేదు వసంతకి. అయినా జానకి అనవసరంగా అడగదులే అనుకుంది. "ఔను బెస్ట్‌యాక్టర్‌గా కాలేజీలో రెండుసార్లు ప్రైజులొచ్చెనే, గుర్తులేదూ?" కళ్ళుతుడుచుకుంటూ అన్నది వసంత.

"మరింకేం నేను చెప్పినట్లు చెయ్యి," అంటూ ఆ విధానమంతా బోధించింది జానకి.

"అమ్మయ్యో! నే నట్లా చెయ్యలేను జానకీ! పాపం ఆయన ..." భయంగా - జాలిగా అన్నది వసంత.

"పాపం ఆయన ——— ఎం - ఏమైపోతాడమ్మా నీ ప్రాణేశ్వరుడు ఈ రెండ్రోజుల్లో! నువ్వింత మంచి దానివి గనకే ఆ రాజుగారి ఆటలు సాగుతున్నై," అంటూ ఘాటుగా కోప్పడింది జానకి.

"మరి కథ ఏదని అడిగితే," అనుమానంగా చూసింది వసంత.

"కథా! నువ్విట్లా చేశావంటే ఓ నాల్గు రోజులు - కథమాటెత్తడిక మీ ఆయన. ఈ లోపల 'అదుగో, ఇదుగో' అని తప్పించుకోలేవూ - పెద్ద

వసంతా విధేయుడికి అర్ధాంగివై యుండి!" వేళాకోళంగా అడిగింది జానకి.

"నువ్వేం వెక్కిరించనక్కర్లేదు. నువ్వే చూద్దుగానిగా." అని సవాల్ చేసింది వసంత.

"నీ సామర్థ్యం గూర్చి ఇక నాకేం అనుమానంలేదు. ఇంత మంచి సలహా చెప్పినందుకు నాకో కోరిక తీర్చాలే వసూ నువ్వు," అన్నది. జానకి వసంత శరీర స్థితిని గమనిస్తూ, సన్నగా నవ్వుతూ.

పాపం వసంత అమాయకురాలు. "అంత కంటేనా - ఆయన కీ కథల పిచ్చి వదలాలేగాని - నీ కోరిక తీర్చలేననుకున్నావా? నీ పథకం గనక వర్కించిందో నీకు మొట్టి ప్రెజెంటేషను," కిలకిల నవ్వింది.

"ఏం లేదూ-నాకు నీ వియ్యపురాల్ని కావాలని వుంది," అన్నది జానకి. ఎందుకనో గాని వసంత ఆగకుండా సిగ్గుపడిపోయింది. కాస్సేపు కబుర్లు చెప్పి ఇంటి కెళ్ళిపోయింది వసంత వియ్యపురాలు జానకి.

* * * *

రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చాడు రాజు. వసును చూడ కుండా ఇన్ని గంటలు గడపడమంటే అతనికి చాలా బాధగానే ఉంది. కాని తప్పదుమరి. "పాపం - ఎంత ఇదై పోతోందో వసు నా కోసం?" అనుకుంటూ ఇంటి కొచ్చేసరికి వసంత అపర శారదాదేవిలాగా కనిపించింది - చుట్టూ తెల్ల కాయితాలూ, పక్కన రెండు పెన్నులూ, అల్లంత దూరాన కాఫీ వుంచుకున్న ఫ్లాస్కూ; అప్పుడప్పుడూ అనుకోవటానికి వీలుగా ఒక దిండూ - నుదుట అలసటను సూచిస్తూ చిరుచెమటలు — వగైరా వగైరా సరంజామాను చూచి ఎంత ఆశ్చర్యపోవాలో అంత ఆశ్చర్యపోయాడు. కథ వ్రాస్తోంది వసంత - నిజంగా కథే వ్రాస్తోంది.

లేని పక్షాన పెన్ను ముట్టుకోవడమంటేనే అదో రకం చికాకు గదా ఆ అమ్మాయికి 'కలా? నిజమా?' అని, కళ్ళు నులుముకుని చూసి మరీ ఆశ్చర్యపోయాడు రాజు. "వసూ! వసంతా!" అన్నాడు దగ్గరికి వెళ్ళి. అతని గొంతులో అనురాగమన్న మాట జీవం పోసుకుని నర్తించింది.

ఆ పిలవబడిన అమ్మాయి పలకలేదు సరిగదా తొణకలేదు బెణక లేదు-కదలనైనా కదలలేదు. ఆమె కలం గబగబా నడిచిపోతున్నది. రాజు అనురాగానికి ఈ ఆరునెలల్లోనూ ఇంత దెబ్బ ఎప్పుడూ తగల్లేదు. కొంచెం సేపటికి తెప్పరిల్లుకొని "నా మీద కోపమొచ్చినట్లుందే దేవిగారికి. అయినా కోపంగా వున్నప్పుడే నువ్వెక్కువ బావున్నావ్ వసూ? కథేనా వ్రాస్తున్నావు? నాకు తెలుసు. నువ్వు బుద్ధిమంతురాలివని - ఇదుగో చూడు ఈ పూలమాలంతా నీకే," అంటూ ఆమె జడను సమీపించాడు. ఉలికిపడి గభాల్న జడ ముందరి కేసుకుంది వసంత. తర్వాత తల్లోని పువ్వుల్ని తుడుముకుంది.

"ఏమి టల్లావులిక్కిపడ్డావ్ వసూ? ఏమైంది?" ఆదుర్దాగా అడిగాడు

"ఓ-మీరేనా? ఎవరో తలపట్టుకున్నట్లుంటేనూ ఉలిక్కిపడ్డాను. ఎంతసేపైంది ఇంతకీ మీరొచ్చి,"అన్నది వసంత నల్లని కలాన్ని పచ్చని చెక్కిలిపై ఆనించుకుంటూ, తెల్లని జరీచీర కట్టుకుని, బుగ్గమీద పెన్నుంచుకుని, మల్లెపూలు పెట్టుకున్న పొడుగాటి జడను ముందరి కేసుకుని, కాటుక్కళ్ళను సుతారంగా చిట్లించి చూస్తున్న వసంతను కన్నార్పకుండా చూశాడు. రాజు ముగ్ధుడైపోయాడు.'రోజూ చూసే వసంత ఈ అమ్మాయి కాదా?' అన్న అనుమానమూ కలిగింది. ముందు కెమేరా కోసం పరిగెత్తాలో లేకపోతే 'ఏదేది-నీబుగ్గమీద అంటినట్లుంది సిరా.అరెరె! తుడవనా?" అంటూ అమ్మాయిని దగ్గిరకు లాక్కోవాలో తెలీలేదు అతనికి.

ఈ సాత్విక భావాల గొడవేం పట్టినట్లు లేదు వసంతకి. గబగబా వ్రాసుకు పోవటం మొదలెట్టింది. మళ్ళీ దిగ్భ్రాంతుడై పోయాడు రాజు కాళ్ళకున్న బూట్లు అతనివంక జాలిగా చూశాయి.
తన సంగతి అట్లావుంచి యజమాని దురవస్థ గురించి పెర్లిన్‌షర్టు ఉస్సూరుమన్నది. అసలే చెరిగిపోయిన క్రాఫ్ మరోసారి చెదిరి బాధపడింది.చేతివాచీ నిశ్శబ్దంగా నిట్టూర్చింది. సదరు వస్తువులవంక నిస్సహాయంగా జాలిగా చూశాడు రాజు. మరో మూల హృదయం గోల పెడుతున్నది. ఇంతెందుకు ప్రకృతే మూగవోయింది.

పాపం రాజు ఏంచేస్తాడు మరి. తనే బూట్లు విప్పుతున్నాడు. 'వసంత కథ వ్రాస్తోంది. నిస్సంశయంగా కథే-గొప్ప కోరికలు నెరవేరాలంటే ఇట్లాంటి చిన్న చిన్న కష్టాలు పడందే లాభంలేదు 'కష్టే ఫలే' అన్నారు.

పెద్దవాళ్ళు. అలా పెర్లిన్ షర్టు వగైరాలకు కూడా చెప్పి నచ్చజెప్పి ఓదార్చాడు. పడక కుర్చీలో జార్లబడి వసంతని చూస్తూ కూర్చున్నాడు. అంతర్వాణి 'ఆకలో'అని గోలపెడుతున్నా లెక్కచేయటం లేదు.

ఓర కంట భర్త అవస్థని గమనిస్తున్న వసంత ఇక వూరుకోలేకపోయింది. 'అన్నం పెడతాను రండి గబగబా తినేద్దురు గాని, నేను తొందరగా వచ్చి కథ వ్రాసుకోవాలి మంచి రసపట్టులో వదిలేసి వచ్చాను,' అన్నది. లేచివెళ్ళి అతని ఉంగరాల జుట్టును సరిచేస్తూ.

పూలపొట్లం లాంటి ఆ చెయ్యేనీ- చెయ్యేనే కాదు. దాని తాలూకు మనిషినీ దగ్గరకు లాక్కుని గాఢంగా ముద్దులాడాలనే కోరిక పరవళ్ళు తొక్కింది రాజు మనస్సులో. బలవంతాన అణచుకుని, 'పద' అంటూ వంటింట్లోకి నడిచాడు పాపం రాజు. వసంత అతను ఎంత కావాలంటే అంతే వడ్డించింది. అందుకనే అర్ధాకలితో లేచాడు.

పదకొండు గంటల దాకా వసంత చేతిలో పెన్ను చకచక సాగి పోతూనే ఉన్నది- సత్యభామ చేతిలో బాణంలాగా.

తొమ్మిది ముప్పావు నుంచీ పక్కమీద పడుకుని ఎదురు చూస్తు న్నాడు రాజు. ఇందాకట్నించీ చేసిన దారుణానికి భార్య చెప్పుకోబోయే సమాధానం కోసం. అమ్మాయి పెద్దపెద్ద కళ్ళు అల్లల్లార్చి జాలిగా తన వంక చూసినప్పుడు, 'ఊఁహూఁ, లొంగిపోకూడదు' అని మనసుకి మరో సారి హెచ్చరిక చేసుకుంటూ పడుకున్నాడు- కానీ తన గురించి వసంత ఉవణ్మాత్రమైనా ఆదుర్దా పడుతున్నట్లు కనిపించటల్లేదు.

గడియారం పదకొండు గంటలు కొట్టింది. గభిక్కున మంచం మీంచి లేచి, 'వసంతా! నువ్వు వ్రాసేది నవలా?' అని వ్యంగ్యం స్ఫురిం చేట్లు అన్నాడు రాజు.

'అంతా అయ్యాక మీకు చూపిస్తాగా! ఈ లోపలంతా సస్పెన్సన్న మాట. నిద్ర వస్తోందండీ- కానీ మూడ్ కుదిరినప్పుడు వ్రాయకపోతే ఎట్లా? అందుకే ఇన్నాళ్ళనుంచి వ్రాయలేదు,' అన్నది వసంత వ్రాసు కుంటూనే.

భార్య మీద ప్రేమ పొంగి పొర్లుకువచ్చింది రాజుకు. 'అమ్మ దొంగా! ఇన్నాళ్ళబట్టీ నన్ను మభ్యపెట్టావు గదూ వ్రాయడం రాదని? ఎంత నాటకం ఆడావు! వసూ! త్వరగా పడుకో మరి. నీ ఆరోగ్యం ముఖ్యం.' అంటూ నిద్రపోయాడు రాజు. మృదువుగా తట్టి, తనని లేపి, మొహం కడుక్కోవటానికి నీళ్ళిచ్చి- తర్వాత వేడివేడి కాఫీ కప్పుతో ప్రత్యక్షమౌతుంది వసంత రేపొద్దున్న కూడా- రోజూ లాగే అనుకుంటూ. కానీ అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే ఇహ లేనిదేముంది!

దాదాపు ఏడు గంటలకి లోపలికి చొచ్చుకుని వచ్చిన సూర్యకిరణాలు నిద్ర లేపాయి రాజుని- 'అరె దాలా ప్రొద్దెక్కిందే, వసంతా! నన్ను లేపలేదేం!' అని ప్రశ్నిస్తూ ఇవతలికి వచ్చాడు రాజు. ఆ గదిలో వసంత కూర్చుని వ్రాసుకుంటున్నది. నిన్నటి విషయమంతా గుర్తొచ్చిందప్పుడు. అమ్మయ్యో! వసంత కాఫీ కాచినట్లు లేదే- ఇక హోటలు కాఫీయే శరణ్యమా?' అని కొంచెం భయం వేసిందతనికి.

తలెత్తి 'నిద్ర లేదారా? ముఖం కడుక్కుని, అదుగో, ఫ్లాస్కులో కాఫీ ఉంచాను. తాగండి- నే తాగేశా లెండి' అన్నది వసంత.

ఇంత అక్రమం ఎక్కడన్నా వుంటుందీ? ఎల్లాంటి వసంత ఎట్లా మారిపోయిందీ? అయినా ఒకర్నని ఏం లాభం? గబగబా వెళ్ళి కాఫీ తాగేశాడు రాజు.

ఉడికీ ఉడకక ముందే అన్నం దించేసి, గబగబా కూరముక్కలు తరిగిపడేసి మళ్ళీ వ్రాసుకుంటున్నది ఆ పిల్ల. 'కూర మాడుతోంది వసంతా!' అంటే ఏదో సామెత చెప్పినట్లు, 'కాస్త మీరే దించెయ్యండి' అన్నది. 'అన్నం మీరే పెట్టుకు తినండి' అన్నది.

ఇదీ జరిగిన సంగతి.

\+ \+ \+

రెండురోజులిట్లా జరిగేసరికి రాజు డీలా పడిపోయాడు. అతగాడి రూపురేఖా విలాసాలు మారిపోయాయి. 'ఈ కథలు వ్రాస్తూ వసంత నాకు దూరమైపోతోంది. ఏం చెయ్యడం? ఆరు నెలల నించీ వ్రాయమని వేపుకు తిని, ఇప్పుడు మానెయ్యమంటే ఎట్లా- మీరింత భార్యాలోలురేం. మరీను అని నవ్వుతూ వసంత. నవ్వితే నవ్వింది గాని మానేస్తుందని హామీ

ఏమిటి?' ఇట్లా ఆలోచించుకుంటూ చిక్కిపోతున్నాడు రాజు- చెక్కిళ్ళలో మరీను.

రెండున్నర రోజులు తానకి చెప్పినట్లే చేసింది. కానీ ఇక అట్లా చేయటానికి అసాధ్యమై పోయింది వసంతకి- 'బాబోయ్! ఇక నా వల్ల కాదు. ఇప్పుడు చేసినదానికే నిష్కృతి యేమిటో? ఆయన్నే అడిగితే, అమ్మో!' అని నానా హైరానా పడిపోతోంది ఇంటి దగ్గర.

\+ \+ \+

రాజు స్నేహితు లందరూ 'ఇదేమిటోయ్ ఇలా అయిపోయావ్? ఏమిటి సంగతి? మొన్నటి వరకూ దేవేంద్రుడిలా వుండేవాడివి గదా?' అని ప్రశ్నించారు.

'మీ ధర్మపత్ని సతీ అనసూయా వాళ్ళ కోవకి చెందుతుందని విన్నానే' అని పరామర్శించారు ఎదురింటి ఆచార్లు. రాజూ వసంతల అన్యోన్య దాంపత్యానికి ఈర్ష్యపడే వాళ్ళల్లో ఒకడేమో మరి. ఏదో సమాధానం చెప్పి తప్పించుకున్నాడు రాజు.

ఆర్.పి.హోమ్, సీ హెచ్.ఎల్. అనే ఇద్దరు ఆప్తమిత్రులకు మాత్రం తన సంగతి నివేదించక తప్పలేదు రాజుకి.

సి. హెచ్.ఎల్. అంటే చింతలపాటి సీతారామాంజనేయులుకి అనుమానం వచ్చింది. 'రాజా! మీ ఆవిడ వ్రాసిన కథని నువ్వు చూశావా? కనీసం ఒక్క కథనైనా?' అన్నాడు సిగరెట్ వెలిగించి పొగలు ఆకాశంలోకి వదుల్తూ, పెద్ద డిటెక్టివ్ పోజులో.

'ఊఁహూఁ— వ్రాసిన కాయితాలన్నీ పెట్లో పెట్టి తాళం వేసుకుని ఆ తాళం చెవిని మంగళసూత్రాలకు కట్టుకుంటోందోయ్!' బాధగా అన్నాడు రాజు.

'అదీ అట్లా చెప్పు- కథలు వ్రాయమని మీ ఆవిడ్ని బెదిరించిన రోజు మీ యింటి కెవరైనా వచ్చారా- అంటే ఆవిడ అన్నలు గాని వదినలు గాని, ఆలోచనా పూర్వకంగా ప్రశ్నించాడు. సి.హెచ్.ఎల్.

'అది హత్యా నేరమో, దొంగతనమో కాదోయ్ చిట్టి తండ్రీ!' అని కోప్పడ్డాడు ఆర్.పి.హామ్. 'రాజా? 'రాజా! నే చెప్పినమాట విను, ఇంటి కెళ్ళి తొందర తొందరగా బట్టలు సర్దేసుకుని సూట్ కేసులో పెట్టేసుకుని రెండు నెల్లదాకా రానని చెప్పి చరచరా వీధిలోకి వచ్చేయవోయ్, అన్నాడు ఆర్.పి.హామ్. అనగా రెంటాల పరంధామ్.

'ఏడిసినట్లుంది నీ సలహా. ఆవిడింకా పెన్ను టకటక లాడించు కుంటూనే 'మంచిది, వెళ్ళిరండి. మరో నాలుగు నెలలుండి మరీ రండి,' అంటే ఏంచేస్తావ్? వీణ్ణి నీయింట్లో వుంచుకుంటావా?' అన్నాడు సి. హెచ్. ఎల్. రాజుని ఉద్ధరిస్తున్న ధోరణిలో. ఎలాగైతేనేం ఒక నిశ్చయానికి వచ్చిన తరువాత ఆ ముగ్గురు మిత్రుల సమావేశం ముగిసింది.

× × ×

ఆ సాయంకాలం —

మబ్బురంగు వుల్ వాయిల్ చీర, అక్కడక్కడ మామిడి పిందెల డిజైన్ ఉన్నది కట్టుకుని, మామిడి పిందె ఆకారంలో బొట్టు పెట్టుకుని తదియ చంద్రుడి లాంటి పెదవులతో సన్నగా నవ్వుతూ తన రాజు కోసం ఎదురు చూస్తూ నుంచుంది వసంత.

చాలా సీరియస్ పోజులో ఇంటికెళ్ళిన రాజుకు మళ్ళీ ఇలాంటి స్థితిలో వసంతను చూడగానే షాక్ తగిలినట్లయిపోయింది. కాదూ మరి. ఇంకో సందర్భంలో అయితే 'కలయో వైష్ణవ మాయయో' అని కావ్య

పరిభాషలో కాస్సేపు భార్యామణిని ఏడిపించేవాడే. కానీ నేడు కార్యాంతర వ్యగ్రుడై వుండె- అందుకని వసంత నోసారి ఓరకంట చూసేసి లోపలికి వెళ్ళి గబగబా బట్టలు సర్దేసుకోవటం మొదలెట్టాడు. వసంత గాఢంగా ఆశ్చర్యపోయింది. ఎట్టకేలకు పాపమా తరుణి తమాయించుకుని లోపలికి వెళ్ళి 'నేను సర్దుతా లెండి. మీరు సర్దుకుంటే అయినట్లే ఇక. మీ బట్టలకు బదులు నా చీరలే పట్టుకుపోగల్రు. ఇంతకీ వూరి కేమైనా వెళుతున్నారా?' అన్నది ధైర్యం చేసి.

అమ్మాయి మాటలు వినిపించుకోకుండా ఇంకా ఏమిటో వెతుకుతున్నాడు రాజు. భావోద్వేగానికి ఆనకట్టలు కట్టుకుంటూ, 'ఏమిటండీ మాట్లాడరూ?' కొంచెం దుఃఖం మిళితమైన గొంతుతో అన్నది వసంత, తనను తానే సంబాళించుకుంటూ.

మరో నాలుగు నిమిషాలకుతలకాయి యెత్తి 'వసంతా! నేను ఆఫీసు పనిమీద వూరి కెళుతున్నాను. రెండు నెలల దాకా రాను బహుశా,అన్నాడు సూట్ కేస్‌కు తాళం వేస్తూ,

ఇది తన నిర్లక్ష్యానికి శిక్షే అనుకుంది వసంత. ఆమెకి ఠోర్న ఏడుపొచ్చింది. రాజులోని అనురాగ ప్రవంతి ఉబికిపోయింది. 'వసూ! వసంతా! ఏమిటి పిచ్చిపిల్లలా యేం? ఏడ్చేస్తున్నా వేమిటి? ఛా ఛా ఛా- నీకు తాయిలం పెట్టనా? ఊరుకో మరి' ఇన్నాళ్ళ ఆపేక్ష పొంగి పొరలగా భార్యను దగ్గరకు తీసుకుని ఆమె కన్నీళ్ళు తుడిచాడు- తుడిచిన కొద్దీ ఆమె కన్నీళ్ళు ఎక్కువైపోతున్నై- అరెరె! ఎట్లా ఇప్పుడు? ఓదార్చటం కాక బంగారు పడిపోయాడు రాజు. కలకంఠి కంట కన్నీరొలకడం సంగతి కాపురం పెట్టిన ఆరు నెలల తరువాత గాని తెలిసిరాలేదు మరి!!

కాస్సేపటికి వసంతే కన్నీరు తుడుచుకుని 'ఈ రెండు నెలలూ నన్నేమై పొమ్మన్నారు? కాస్త చెప్పి వెళ్ళండి. సరిగ్గా ఆఫీసు పనేనా?

ఇదివరకెప్పుడూ లేనిది ఇప్పుడేం వచ్చింది? మీరేమో ఇట్లా చిక్కిపోయారు. హోటల్లో తిండి మీకు పడదు. ఇంకెలా అయిపోతారో!' అన్నది మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది.

'ఆఁ ...... నేను చిక్కిపోతే ఎవరిక్కావాల్లే. నా చేత్తో నేనే వడ్డించుకు తినటం కన్నా ఆ హోటలువాడు వడ్డిస్తేనన్నా శాస్త్ర నయిస్తుందేమో.' నిర్లిప్తతగా, నిర్వేదంగా అన్నాడతను.

అందులోని వ్యంగ్యానికి వసంత హృదయం మండిపోయింది.

'ఇంత ఉపేక్ష చేస్తున్నా రేమిటండీ? నేను మీ వసంతను కదా- మిమ్మల్ని చూస్తే నాకు దిగులుగా వుంది.' అన్నది భయపడిపోతూ.

'ఇంకా నయం. ఉపేక్ష చేస్తున్నది నువ్వా నేనా? నువ్వెళ్ళు. రాణీ వెళ్ళి కథలు వ్రాసుకో- అయ్యో! ఇంత టైం వేస్టు చేశావేం- ఎట్లా? అన్నట్లు ఈ రెణ్ణెల్లలోనూ బోలెడన్ని కథలు వ్రాసుకోవచ్చు- మధ్యమధ్య నా దిష్టర్బెన్సుండదు హాయిగా' అన్నాడు రాజు.

వసంత ప్రాణం విలవిలలాడి పోయింది- 'నన్ను క్షమించరూ?' అంటూ పాదాల మీద వాలిపోతున్న భార్యను లేవదీశాడు రాజు. 'ఏం? ఎందుకని? నువ్వేం తప్పు చేశావు గనక-' అన్నాడు.

'ఏం తప్పు చేశానో నాకు తెలుసు. మీకూ తెలుసు కారణాంతరాల వల్ల అట్లా చేశాను- అబ్బ! ఏం కథలండీ బాబూ! చచ్చిపోయాను వ్రాయలేక. చెయ్యి నొప్పెడుతోంది' అంటున్న వసంతని చూస్తే అమితమైన జాలి పుట్టుకొచ్చింది. రాజుకి కథలూ వద్దు, కాకరకాయలూ వద్దు గాని పూర్వంలా వుండు వసూ! నాకదే పదివేలు. అసలిదేమిటి నువ్వు? నువ్వు కూడా ఇలా అయిపోయావు. నీ చెక్కిళ్ళిలా తెల్లబడి పోయాయేం?

ప్రేమగా ఆమె మొహాన్ని పరామర్శిస్తూ ఆవేదన నిండిన కంఠంతో అన్నాడు రాజు

వసంత చిరుసిగ్గును దాచుకుంటూ 'అదేమిటో తెలుస్తుంది లెండి' అంటూ పారిపోయింది, రాజు ఆశ్చర్యంగా చూస్తూ నుంచున్నాడు.

'ఇదిగో? నేను వ్రాసిన కథ– చూపిస్తానన్నాగా– సరస హృదయులూ అయిన భర్త గారికి అంకితమిస్తూ నిజంగానే ఓ కథ వ్రాస్తాను చూస్తుండండి– ఇప్పుడు మాత్రం నన్నేం అనకండి ప్లీజ్' అన్నది నీళ్ళతో మెరిసే కళ్ళతో నవ్వుతూ– ఒక కాయితాల కట్ట అతని చేతిలో పెట్టింది.

ఆత్రుతగా వాటిని చూశాడు రాజు. 'ఇదేమిటి! అమ్మదొంగా; రామకోటి వ్రాశావా? రామకోటి. చిట్టి! ఇన్నాళ్ళూ రాత్రీ పగలూ కూర్చుని జరజరా వ్రాసేసింది ఈ రామకోటినా? అబ్బ! ఎంత ఏడిపించావ్ నన్ను. వసంత చెక్కిళ్ళను ఊపిరాడనీయలేదు రాజు.

అతి ప్రయత్నం మీద విడిపించుకుని 'ఏమండీ, మీ ప్రయాణం ఇంకో మూణ్ణెల్ల తరువాత వచ్చేట్టు చూడకూడదూ?' అప్పుడు నేను మా పుట్టింటికి వెళ్ళాలిగా మరి' అంది వసంత యధాలాపంగా.

,నా ప్రయాణమా? అదీ నీ రామకోటి లాంటిదే. నువ్వు పుట్టింటికెళతావా? నిజమా? అర్థమైపోయిందిలే వసంతా! అరె, ఇటు చూడమంటూంటే' రాజు చేతుల్లోంచి తప్పించుకుని పారిపోయింది ఆ రామకోటి రచయిత్రి.

మళ్ళీ కాస్సేపటికి 'ప్రయాణం అబద్ధం ప్రసాదం నిబద్ధం అన్నారు పెద్దలు. ఇవిగో కొబ్బరి ముక్కలు పట్టండి. ఇవ్వాళ శనివారంగా. మీకీ కథల పిచ్చి వదిలితే కొబ్బరికాయలు కొడతానని మొక్కుకున్నానులెండి' అంటూ పళ్ళెంలో కొబ్బరి ముక్కలతో సహా ప్రత్యక్షమైంది వసంత. *

# బాబు కోసం

ఏడవకు ఏడవకు చిట్టి నా తండ్రీ
భావి భారత వీర సోదరవు నీవూ
బాల చంద్రుడు చూచి పరిహసిస్తాడూ
వీర శివాజీ నిన్ను వెక్కిరిస్తాడూ

ఆఫీసు నుంచి వచ్చిన రాజేంద్ర ఆ గానానికి ఆకర్షితుడై లోపలికి నడిచాడు బూట్లు టక టక లాడిస్తూ.

విప్పారిన మొహంతో, పాట ఆపేసి, నిశ్శబ్దం అన్నట్టు సైగ చేసింది అపర్ణ.

భార్యవైపు ఆశ్చర్యంగా చూశాడు రాజేంద్ర.

బాపూ బొమ్మలా, నాజూగ్గా, చలాకీగా వుండే అపర్ణ ఎంత మారి పోయింది నడికట్టు, తాంబూలం, మాతృత్వపు దీప్తితో మిడిసిపడు తున్న మొహం, సాంబ్రాణి సువాసనలు- ఆ బాలింతరాలి ముగ్ధ మొహన మూర్తి నయనానందకరమైందతనికి.

అతనలా పరవశంగా చూస్తుంటే సిగ్గుగా తలవంచుకుందామె.

"అపర్ణా!" ఆప్యాయత వాకలు కట్టిందతని కంఠంలో.

ఆపాదమస్తకం ఝల్లుమన్నది ఆమె శరీరం.

'తొందరగా వచ్చి బాబును పలకరించండి. నాన్నగారి కోసం కలవరిస్తున్నాడు' అన్నది వన్నగా నవ్వుతూ

"అలాగా? బాబు తల్లి కలవరించడం మానేసిందన్న మాట నా కోసం! అవున్లే. ఆవిడకిప్పుడు నేనెందుకు గుర్తుంటాను? కొత్త ఫ్రెండు పుట్టుకొచ్చాడుగా. సరే. ఇంతకీ వాణ్ణి ఎత్తుకోవటం ఎట్లాగో చెప్పు. నాకు భయం-"

బిడ్డను జాగ్రత్తగా అతని చేతుల కందించింది పొత్తిళ్ళలో పెట్టి.

అపూర్వమైన పుత్రగాత్ర పరిష్వంగ సుఖం అనుభవిస్తూ పులకరించి పోయినాడు రాజేంద్ర తండ్రిగారి ఈ గాఢ ప్రేమకు అబ్బాయి గారు తట్టుకోలేక కెవ్వుమన్నాడు.

"అరెరె. ఏడ్చేస్తున్నాడపర్ణా? వీణ్ణి తీసుకో" అని కంగారు పడ్డాడు రాజేంద్ర. "బావుంది మీ కంగారు!" అంటూ కొడుకునందుకుని ఎదకు హత్తుకుందామె. తల్లిని కరుచుకుపోయి ఏడుపు మానేశాడు ఆ పసిగుడ్డు.

అది చూసి బుంగమూతి పెట్టాడు రాజేంద్ర

"నాలుగురోజులు పోతే మిమ్మల్ని వదిలి నా దగ్గిరికి రానంటాడు వాడు. తొందరపడతారెందుకు?''

మృదువుగా కొడుకు బుగ్గ నిమిరి "ఏమిటోయ్ వంగతులు? నిన్నెలా పలకరించాలో తెలీటల్లేదు నాకు పలకరించకపోతే మీ అమ్మ తంతుందాయె'' అన్నాడు రాజేంద్ర.

"దాల్లేంది పసిబిడ్డను పలకరించడమే తెలీదేం? నోట్లో వేలుపెడితే కొరకను కూడా లేరు. కొడుకు పుట్టాకైనా నేర్చుకోవద్దూ?'' ముసిముసిగా నవ్విందామె.

"ఏమిటి నేర్చుకోవడం? వేలు కొరకడమా? వేలేం ఖర్మ-బుగ్గే కొరుకుతాను" అంటూ ఒక సెకెను తర్వాత "ఏం ఒప్పుకుంటావా ఇప్పుడు?" అన్నాడు అతను.

"అబ్బ-మొరటుతనం మరీను. నేనునేర్చుకోమన్నది గాదు. కాస్త పెద్ద మనిషితనం"

"అయితే నీ కళ్ళకు కుఱ్ఱాడిలా కన్పిస్తున్నానా?"

ఊఁ బొత్తిగా పసిపాపాయిలా, ఒక ఏడాది అబ్బాయిలా కన్పిస్తారు." కొంటెతనం రంగరించిన సిగ్గుతో కడగంట చూసి తలొంచేసుకుందామె బాబుని ఉయ్యాల్లో పడుకోబెడుతూ.

అతనేం మాట్లాడలేదు. కానీ అతని చేతులు ఆమె భుజాల చుట్టూ బిగుసుకున్నై. అతని మొరటు తనం మరింత విజృంభించింది.

"వదలండి ప్లీజ్. తప్పని చెప్పని చెప్పలేదూ? అదుగో మీ కంటే కొంటెవాడు మీ అబ్బాయి ప్రత్తికాయలంత కళ్ళతో ఎట్లా చూస్తున్నాడో మనల్ని "అంటూ బలవంతాన వదిలించుకుంది అపర్ణ.

"వీడొకడూ-మధ్యన-వీడివల్లే మనం దూరమైనాం" అతని కంఠంలో చిరుకోపమూ, ఆత్రమూ.

అతనివైపు జాలిగా చూసి నవ్విందామె.

"ఇదుగో, నువ్వు నీ కొడుక్కి ఆ దేశభక్తి పాటలవీ నేర్పించకు చెప్తున్నా." సందర్భంలేని కోపం ప్రదర్శించాడతడు.

"ఎందుకనీ?"

"నాకిష్టంలేదంతే."

"ఇష్టమే లేదూ?" ఆందోళన.

"అవును అనవసరంగా ఆ లంపటంలో పడి పెద్దయినాక చెడిపోతాడు వాడు."

"చెడిపోతాడా?"

"ఔను ఆ పిచ్చి అంటిన మనిషి సుఖపడలేడు"

"మరి వాడికి చాలా ఇష్టమండీ అలాంటి పాటలంటే అందుకే వచ్చీ రాకుండా అయినా అవే పాడుతుంటా. ఇంకేవి పాడినా ఊరుకోడు. నిద్ర అసలు పోడు పోరుపెట్టి ఏడుస్తాడు."

ఏమిటీ? ఈ పసి వెధవకి ఆ పాటలే ఇష్టమా? అవే పాడాలంటాడా? సరే, సరే, ఏదో ఏడు. అవేపాడు కానీ వాణ్ణిట్టుకు ఏడిపించకు."

"ఏమండీ!" ఏదో అడగాలని ఆశగా చూసిందామె.

"ఇంకేం మాట్లాడకు కాకినాడ బండీ! నే వెల్తున్నా." దిగులుగా, బాధగా, భయంగా చూస్తూ నుంచుంది అపర్ణ. ఇవాళే తను పుట్టింటి నించి వచ్చింది. ఇవాళ కూడా....

× × ×

"మీ కుమార కంఠీరవుడికి ఏం పేరు పెడదామనుకుంటున్నారు?" భర్తకు తాంబూలం అందిస్తూ అడిగింది అపర్ణ. ఆదివారం మధ్యాహ్నం- "అసిత్‌గాని అరుణ్‌గాని. నీ ఉద్దేశం కూడా చెప్పు."

"పేర్లు చాలా బావున్నైగానీ..."

"కానీ?"

"మరీ అలాంటి అతి నాజూకు పేర్లు దేనికని..." సంశయంగా ఆగిందామె.

"అయితే వద్దంటావా ఈ పేర్లు"

"మీరూ-మీ అబ్బాయీ-మీ ఇష్టం-మధ్యనేనెవర్ని వద్దనేందుకు?"

"నువ్వా? నువ్వెవరి వేమిటి? బాబుకి కన్నతల్లివి. నా నెత్తి మీది దేవతవూను"

ఆమె మొహంలో వెలుగు.

"ఊఁ దేవతల్ని కాస్త సాయంత్రాలు ఇంట్లో వుండమంటేనే ఉందరుగాని-ఉత్త అబద్దాలు"

"టాపిక్ పక్కదారి పట్టించకపద్దా! ఆ విషయంలో కల్పించుకో వద్దని ఎన్నిసార్లు చెప్పాలి నీకు? అలవాట్లు మానుకోవడం నువ్వను కున్నంత సులభంకాదు జాగ్రత్త" కోపంగా అన్నాడతను.

అదే చిత్రం! యిట్టే అమృత మాధురు లొలికిస్తాడు. అట్టే అగ్ని వర్షం కురిపిస్తాడు. ఎప్పుడు కోపమొస్తుందో తెలీదు.

కన్నీళ్ళు తుడుచుకుని "ఏమండీ" అని మృదువుగా పిలిచిందామె.

"ఊఁ ఏం" కోపం తగ్గినా ఆ సంగతి ఒప్పుకోని కంఠం అది

"అబ్బాయి పోలికలన్నీ మీవేనండీ, చాలా అందంగా తయారౌ తాడు, మీలాగే"

"పిచ్చిపిల్లా!" అంటూ పెళ్ళాం తల మీద ముద్దుపెట్టుకుని "ఇంకె ప్పుడూ ఇలా కోపం వచ్చేట్టు రెచ్చగొట్టకేం" అన్నాడు వాత్సల్యంగా.

"ఇంతకీ బాబు పేరు......?"

నువ్వేం పెట్టాలనుకున్నావో చెప్పు మరి"

మురళీ కృష్ణ అని పెడితే బావుంటుందండీ"

"అయ్యో చిత్రం. మీరు చెప్పిన పేరు ఎందుకు బావుండదండీ?"

అదుగో ఎగతాళి చేస్తున్నారు పోండి."

"ఎగతాళి కాదమ్మాయ్, వీడికి నీ ఇష్టమైన ఆ పేరే పెడతాం పై సారి మటుకు నా ఇష్టమైన పేరు పెట్టుకుంటాను. ఎగ్రీడ్?'

'ఛీ పోండి, వీడికి మూడు నెలలైనా నిండలేదు. అప్పుడే మళ్ళీ... ఆప్యాయ మాధుర్యాలు ఒలికిస్తూ చూసిందామె.

'ఏయ్ ఏమిటా చూపు? నా ఇసలే తొందరగా దిష్టి తగులుతుందం టుంది మా అమ్మమ్మ. కొరుక్కు తింటావా చెప్పు. ఇదుగో బుగ్గ.'

'నారాయణ నారాయణ ఏం మాటలు బాబూ!' అంటూనే యిపా ర్లెంటుగా అతని ఫాలభాగాన్ని పెదిమల కద్దుకుని మొహం పక్కకు తిప్పేసుకుని ముగ్ధగా మధ్యగా, ప్రౌఢగా ప్రాణేశ్వరుణ్ణి అలరించింది.

\+ \+ \+

"ఏది నాన్న 'చేతులారంగ' చదువు."

"ఇప్పుడు తదవను" నిష్కర్షగా చెప్పేశాడు మురళీకృష్ణ.

'ఊఁ బావుంది రాజసం. ఆ తండ్రికి కొడుకువి కావూ. మూడేళ్లొ చ్చాయి అబ్బాయి గారికి. అక్షరాలు పలకటం సరిగ్గా రాదు" అంటూ

నేర్పించబోతుంది అపర్ణ. తన కొడుకు అగస్త్యుడిలా సర్వ విద్యలూ ఔపోసన పట్టాలని తహతహ లాడుతుందామె

'నేనేం నేతుకోను పో' బుంగమూతి పెట్టాడు మురళి.

'మా బాబు కదూ? ఎందుకయ్యా అంత ఉక్రోషం వచ్చిందివాళ. ఆయన అందంతో పాటు ఆ కోపాన్ని కూడా పుణికి పుచ్చుకున్నావురా నువ్వు?'

'అమ్మా, పునికి పుచ్చుకోవటమంటే?' కోపం మర్చిపోయాడు మురళి

అమాంతం వాడిని గుండెకు హత్తుకున్నది అపర్ణ 'కొత్తమాటలు నేర్చుకోవటమంటే ఎంత ఇష్టంరా నీకు? ఆ మాట కర్థం తర్వాత చెప్తా గాని ముందు నువ్వు పద్యం చదవాలి. లేకపోతే రాత్రి పడుకునేపుడు రఘుపతి రాఘవ పాడను' అన్నది.

ముద్దు మాటలతో పద్యమంతా చదివాడు మురళి.

'మా నాయనే. నా బంగారుకొండే. ఉచ్చారణ కూడా రాని పసి తండ్రివి అప్పుడే పద్యాలు అప్పజెప్తున్నావురా. స్కూల్లో చేరేప్పటికి నీకు కృష్ణ శతకంలో కొన్ని పద్యాలు, సుమతీ శతకంలో కొన్ని పద్యాలూ, చెప్తా- నేర్చుకో మరి- అప్పుడు మాతృభాష బాగా వస్తుందిరా. మిగతావి తర్వాత అవేవస్తాయి. పునాదిబావుంటే- ఒరేనాన్నా! నువ్వు మోక్షగుండం విశ్వేశ్వరయ్య వంటి మేధావి వవుతావా? కృష్ణదేవరాయల వంటి సాహితీ విజయాభిలాషివవుతావా?గాంధీజీలా, శంకరాచార్యులులా, కాళిదాస శ్రీనాధ పోతనలలా ఎవరిలా అవుతావే తండ్రీ నువ్వు? నీ ఇష్టం- ఏ రంగంలో అడుగుపెట్టినా నీకు దీటైనవాడు ఉండకూడదు. అలా పెంచుతానే నాన్నా

నిన్ను' అన్నది అపర్ణ. నిలువెల్లా ఆవేశం ఆవరించి ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'అమ్మా' అంటూ చిట్టి చేతులతో కన్నీళ్ళు తుడిచాడు మురళి.

'ఈ చేతుల కోసమేరా తండ్రీ నేను ఎదురు చూసేది. ఇంకా పెద్దవాడివైతే గాని-'

'పెద్దవారిని అవుతాగా ఇంకా రెండేల్లలో. అప్పుడు నాన్నంత అయిపోతాగా' అని తల్లికి హామీ ఇచ్చేశాడు పసివాడు.

నవ్వులోయి అపుకుంది అపర్ణ పిల్లవాడు ఫీలౌతాడని-

'ఓహో, అలాగేం? ఇంకా రెండేళ్ళలోనే నాన్నంత అయిపోయి నా కష్టాలు తీర్చేస్తావా బాబూ? ఆ మాట చాలురా నాకు. సరే గాని ముందు గాంధీతాత ఏమన్నాడో చెప్పమ్మా మరి. ఎంత పెద్దవాడివైనావో చూద్దాం' అన్నది.

'సత్యం చెప్పాలన్నాడు'

'ఇంకా?'

'ఇంకా...' మొహం సీరియస్‌గా పెట్టి మహామేధావి పోజులో, ఆలోచనలో పడ్డాడు మురళి.

'మరిచిపోయినావా? రేపు చెప్తాలే. ఇంక బువ్వ తిందువు గాని రా'

'నాకొద్దు.'

'ఓద్దూ- అబ్బబ్బ రోజూ ఇంతేరా నువ్వు. అన్నం వద్దంటావు. మా నాన్న రారా.'

'ఊహూఁ లాను.'

'ఎందుకో కోపం వచ్చిందమ్మా నా బిడ్డకి పచ్చటి పసిమిరంగుతో ఉంగరాల జుట్టుతో, పొడుగ్గా ఆరోగ్యంగా, తెలివితేట ఉట్టిపడుతూ మిస మిసలాడే బంగారు తండ్రి శ్రీ మురళీకృష్ణ గారూ! అలక మానేసి అన్నా నికి దయ చేయమని ప్రార్థన?

"ఒద్దంతున్నా నా?"

అన్నావురా నాయనా, అన్నావు. కానీ, తినకపోతే ఎట్లారామరి. ఇదుగో చూడు. మెత్తగా కలిపి ఎంత నెయ్యేస్తున్నానో అంత నెయ్యీ నీకే. నాన్నకు లేదు ఏం?''

"ఔను నాన్నకు ఏం ఎయ్యద్దు."

"ఎందుకనిరా నాన్నా! ఆయన మీద కోపం వచ్చింది? ఇందాక ట్నుంచీ ఆయన మీద కోపమన్నమాట.''

'నువ్వు ఏలుతున్నా ఎల్లిపోతాలెందుకు మలి? నాన్న ఏం ముంటాలు కాలు.'

'నాయనా.' తరతర లాడిపోయింది అపర్ణ.

'అప్పట్నుంచీ నీ చిన్నబుర్ర ఇదా ఆలోచిస్తున్నది? ఎంత పాపిష్ఠి దాన్నిరా నేను? నీ ముందు కూడా బయటపడి పోయినాను. మీనాన్న చాలా మంచి వారయ్యా. ఎంతో మంచివారు. అట్లా అనకూడదు నాయనా నువ్వు. నాన్నంటే ఏమిటో తెలుసా? దేవుడు పితృదేవోభవ అంటారు. ఇంకరా బువ్వతిందువుగాని' ఆర్ద్రంగా అంటూ కొడుకు నెత్తుకుని చెట్ల దగ్గిర నిలబడి పువ్వులు చూపిస్తూ రెండేసి మెతుకులు పెట్టటం మొదలు పెట్టింది.

'అమ్మా! కాకి ఎగురుతోంది' అంటూ చప్పట్లు కొట్టాడు మురళి.

'ఒహో! తల్లీ కొడుకు సంతోషంలో మునిగి పోయినట్లున్నారు'.

రాజేంద్ర కంఠం విని ఉలిక్కిపడింది అపర్ణ.

'సారీ సార్ ఆఫీసునుంచీ వచ్చేకారన్న మాట ఎంతసేపైంది వచ్చి?'

'ఎంత సేపైతే ఏంలే కొడుకుగారి సేవ పూర్తికానీ ముందు'

'ఊరుకోండి మరీను-కాఫీతెస్తా-మీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటుండండి'

'ఈ పాకెట్లు తీసుకెళ్ళు.'

'ఏమిటండవి?' ఒక్క ఉదుటున అందుకొని విప్పిచూసింది.

'ఒహ్? ఉప్పాడ-జరీచీర-ఈ కలర్ నా కిష్టమని మీకెలాతెలుసు? ఇవేమిటి? పూలూ, పళ్ళూ, స్వీట్స్-మీ అబ్బాయికి డ్రెస్-నిజమే. మీరే-తెచ్చారా? ఇవాళ ఇంత అదృష్టవంతులమై పోయినామేమిటి నేను నా కొడుకూ?'

ఆమె సంతోషం చూసి విస్మితుడైనాడు రాజేంద్ర.

తను బజారు నించి బట్టలు తెస్తే ఆమెకెందుకింత పరవశం?

'ఏమండీ! పెళ్ళైనప్పట్నించీ చీర మాటదేవుడెరుగు-పూలు కూడా తేలేదు కదండీ మీ చేతుల్తో. ఇవాళ-ఇవాళ....'

'ఆఘోరించావులే. మీ మురళి కృష్ణ పుట్టినరోజు వస్తున్నదని తెలుసులే ఈ పాకెట్లో బట్టలూ బిస్కెట్లూ వాడికి నీకిచ్చాడు.'

'ఆహా ఏం జోకు? ఈ చీర నాదేనా లేకపోతే....మీదా?

కొంటెపిల్లా!' అంటూ ఆదపుచ్చుకొని 'మీ అమ్మ ఎంత అల్లరి చేస్తున్నదో చూశావా మురళీ' అని అడిగాడు.

'అమ్మకాదు మీరే అల్లరి చేస్తున్నారు' విరాగ్గా అన్నాడు వాడు.

అమ్మతో నాన్న అంత క్లోజ్‌గా వుండటం వాడికి ఇష్టంలేదు మరి. తనకు ప్రత్యర్థిలా ఫీలౌతాడు—

కొడుకు వైపు కోపంగా చూస్తున్న భర్తను చూ సినవ్వుకుంటూ లోపలి కెళ్ళింది అపర్ణ.

మరే నాన్నాలూ!' అంటూ తండ్రి ఒళ్ళోకెక్కాడు కొడుకు-

'ఏమిటి నాయనా! విశేషం? నా ఒళ్ళోకి చేరావు?'

'రాతిలికి మేలు నాకు తదువు తెప్పాలి'—సూటిగా చెప్పాడువాడు,

నేనా? ఛ నాకు రాదురా చెప్పటం? మీ అమ్మనూరి పోస్తున్నది చాలదూ?'

నాకు మేలే తెప్పాలి మీ పక్కలోనే పలుకుని తదువుకుంతా'

'ఏమిట్రోయ్ ఈ కోరికలు?' గాభరాపడ్డాడు తండ్రి.

'అంతే'—

'అదికాదు మురళీ, నేను బయటి కెళ్ళాలిగదరా-నాన్నా! రేపు ఇంకా ఇన్ని బిస్కెటూ, చాక్కెలూ తెచ్చిపెడతా నన్ను వదిలిపెట్టు'

ఊహూఁ నాకు బిబికెట్లు తాక్కాలు ఏం ఒద్దు. మేలే కావాలి రోజూ నేను నిద్రపోయినాక వత్తావు మేలు-నాకు నాన్నే కావాలి. ఊఁ నాన్నే

కావాలి-' అరున్నొక్క రాగానికి అనుగుణంగా కాళ్ళు నేలకేసి కొట్టడం మొదలు పెట్టాడు.

'ఊరుకో నాన్నా! నువ్వట్లా ఏడిస్తే నాకు తోచదురా—' అంటూ ఆపాయ్యంగా కొడుకుని దగ్గిరికి తీసుకున్నాడు రాజేంద్ర. కన్నీళ్ళు తుడుస్తూ' ఇంకేడవకేం-మీ అమ్మొస్తున్నట్లుంది. నిన్ను ఏడిపిస్తున్నానని తెలిస్తే క్ర్ర పుచ్చుకుంటుంది-నాయనా యన!' అని బతిమాలుకున్నాడు.

'అమ్మకల్లపుత్తుకోదు నాన్నాలూ! ఎంతో మంచిది అమ్మ. రోజూ మీలు ఎల్లిపోగానే ఏలుత్తుంది. దేవునికి పాత పాలుతుంది మేలు ఎల్లి పోకండి నాన్నాలూ, అమ్మ ఏలుత్తుంది. నాకు ఏలుపొత్తుంది ఎల్లిపోలుగా ఏం?'

లోలోపల అణిచివేసిన అంతర్వాణి ఒక్కసారి గిలగిల లాడింది రాజేంద్రలో -నిట్టూరుస్తూ అన్నాడు. 'వెళ్ళను మురళీ! వెళ్ళను'

'నాన్నాలు మంచి నాలోయ్-ఇవాల ఇంతో ఇంతా లోయ్' సంబ రంగా ఎగురుతున్నాడు కుఱ్ఱవాడు.

'ఎందుకలా ఏడుస్తుంది అపర్ణ. చెప్తే వినదు. తనను రమ్మంటే రాదు. పైగా నన్ను వెళ్ళద్దంటుంది. ఉత్తపాత చింతకాయ పచ్చడి. ఛీ-ఛీ-బియ్యే పాసైన పిల్ల అంటే చాలా ఫార్వర్డ్‌గా వుంటుంది. అనుకున్నాడు తను. తీరాచూస్తే ఈ గుణాలు-నాకివాళ నిద్రెలా పడుతుంది? ఆఖరికి ఒక్క పెగ్గయినా ఫ్రెండ్స్‌తో కలిసి వేసుకోకపోతే ఎలా? వరుసూ శేఖర్, మోహన్, రావు, రతన్, అందరూ నాకోసం ఎదురుచూసి విసిగి పోతారు పాపం-వాళ్ళంతా మధురసంలో స్వర్గ సౌఖ్యంలో మునిగి తేలు తూంటే నేనిక్కడ... అందుకే 'పెళ్లొద్దో' అని మొత్తుకుంటే వినకుండా అపర్ణ నంటగట్టారు. 'పిల్లలొద్దో' అంటే వినకుండా ఈవిడ కొడుకుని కని

కూచుంది. వీడేమో అలాంటి ఇలాంటి వాడా? అఖండుడు. ఎన్నాళ్లని తప్పించుకుపోగలను. దినదిన గండం నూరేళ్ళాయిష్షు అయిందే నా పని. వెళ్తున్నప్పుడల్లా ఏదో తప్పు చేస్తున్నట్లు ఫీలింగ్. రానురాను ఎక్కువవుతున్నది కాని ఎప్పట్నించో వున్న అలవాట్లూ స్నేహితులూ-వెళ్ళకుండా వుండనూలేను. ఏమిటో ఈ సంఘర్షణ· అసలు ఈ బొట్టిగాడి మాటకోసం నేనెందుకు ఆగిపోతున్నానో తెలీటల్లేదు. అన్నాళ్ళు అపర్ణ బతిమాలితే వినని వాణ్ణి! వీడెందుకు జీవితమిలా ఆక్రమించుకుంటున్నాడు?' రాజేంద్ర మథనపడుతున్నాడు.

అంతలో రతీదేవిలా అలంకరించుకుని వచ్చింది అపర్ణ. ఒక్క నిమిషం పాటు ఆలోచనలన్నీ మరిచిపోయి-రెప్ప వెయ్యటం మరిచిపోయి తన అర్ధాంగ లక్ష్మిని మనసారా చూశాడు.

అపర్ణ సిగ్గుపడి పోయింది.

రాజేంద్ర అనుమానం బయపడనే పడింది.

"నేనొకమాట అడగనా అపర్ణా?"

"ఊఁ"

"ఏమిటి విశేషం? ఇంత అందంగా వున్నావు? మురళికి చెల్లెల్ని గాని ఇవ్వబోవడం లేదు గదా?"

'అబ్బ! మీరు తెచ్చిన చీరకట్టుకు చూపిద్దామని-మీరు మళ్ళీ క్లబ్బు కెళ్ళేవేళ అయిందిగదాని-కట్టుకొచ్చా. మీరు తెచ్చిన పూలు పెట్టుకొని, అత్తగారు శ్రావణమాసంలో పెట్టిన నెక్లెస్ పెట్టుకున్నా, అంతే క్షణం, ఉండండి.' అంటూ వంగి అతని కాళ్ళకు నమస్కరించింది అపర్ణ.

'అరే అపర్ణా! ఎంత పిచ్చిదానివి నువ్వు? ఈ రోజుల్లో ఇలాంటి నమ్మకాలున్న ఆడపిల్లలున్నారంటే ఎవరూ నమ్మను కూడా నమ్మరు. పోనీ నేనేమన్నా మంచివాడినా అంటే అదీ కాదు. అన్ని దురవ్యసనాలు ఉన్నవాడిని. అర్ధరాత్రి ఇంటికొస్తాను. ఒక్కొక్కసారి నీ ముందు తలెత్తలేక పోతాను. సిగ్గూ అహం అడ్డొచ్చిఅప్పుడడగలేదు-ఇప్పుడడుగుతున్నా చెప్పు అపర్ణా! నన్ను క్షమిస్తావా?' బుద్ధ భగవానుడి ముందు అంగుళీ మాలుడి ప్రార్థన లాంటిది.

ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. 'అట్లామాట్లాడకండి. ఇంజనీరుగారూ! మీ మనసు ఎంత మంచిదో నాకు తెలుసు. అలవాటదేముంది మధ్యలో వచ్చినై. మధ్యలోనే పోతై ' అన్నది ఆరాధనగా చూస్తూ.

'అవునా అపర్ణా! నేను మారతా నంటావా?' ఆశ్చర్యపోయాడు ఆమె నమ్మకానికి.

'మారతారు. తప్పకుండా మారతారు. నివురు గప్పిన నిప్పు లాంటిది మీ మంచితనం. ఆ బూడిదను కాస్త ఊదితే చాలు. జాజ్వల్యమానంగా వెలుగుతుంది నిప్పు కణిక.'

కలవరపడ్డాడతను.

'సరే గాని అపర్ణా వయసు పెరుగుతుంటే అందం తగ్గిపోతుందంటారు గదా! నీకు ఇంకాస్త అందం వస్తోంది ఎంచేతనో?'

'మీ కళ్ళల్లో మార్పొస్తే సరి, నా అందం పెరుగుతుంటుంది. ఇంకొన్నాళ్ళకి రంభవి, ఊర్వశివి అంటారేమో-' నవ్విందామె.

'అదెలాగబ్బా! తినగా తినగా గారెలు చేదు అంటారుగా-' ఆలోచనలో అమాయకత నటించాడు.

ఆ పోజే- మురళీ కూడా మొహం అలాగే పెడతాడు. అలా వున్న మనుమలు తెగ ముద్దొస్తారు అపర్ణకి

'దాంపత్య జీవిత మాధుర్యమంటే ఏమిటనుకున్నావ్ రాజా! మరి. తినగ తినగ వేము తియ్యనగును.'

'ఛీ! నువ్వు వేమువేం కాదు నా రాణివి.'

'రాజా! స్వామీ'

'మనకు వీళ్ళిద్దరూ చాలు- ఏం?'

'ఎవరిద్దరూ?' ఉలిక్కిపడింది అపర్ణ.

'అదే మీ అబ్బాయీ మా అమ్మాయీను. ప్రపత్యానికి సుఖం- మనకీ సుఖం.'

ఆమె చెక్కిళ్ళలో మందారాలు.

'మీ అమ్మాయా? ఎక్కడుందండీ?'

"ఇదుగో. ఇక్కడ పొట్టలో. అబ్బఏం సిగ్గు! కొడుకుని తన్న తల్లివి పైగా."

చటుక్కున దూరంగా జరిగిందామె.

"శ్రీరామచంద్రా! బొత్తిగా మీ వైఖరేం బావుతేదు. మురళీ ఇక్కడే వున్నాడు గాబోలు- రేపు ఏ పక్కింటి బొమ్మగారొచ్చినా, పోనీ టెబుల్ మా లక్ష్మి వచ్చినా మన సంభాషణ తూ. చా. తప్పకుండా యాక్షన్‌తో సహా ఏకరువు పెడతాడు.'

'ఔను, వాడు నీ కొడుకు గదా! నీ శిక్షణ అలావుంది. మా అమ్మాయిని అలా చెయ్యను, చక్కగా నేనే పెంచుకుంటా.'

'అయిందా పని?'

'ముందు వీణ్ణి నిద్రపుచ్చు.'

'అప్పుడేనా? అంత తొందరగా నిద్రపోతే మీ కొడుకెందుకవు తాడూ? ఇంట్లో వుంటా నన్నారుగా! ముందు మీకు అన్నం వడ్డించి వాడి పని చూస్తాలెండి.'

'పద అయితే! ఇద్దరం తినేసి వద్దాం'

'ఇద్దరమూనా?'

'ఏమిటపర్ణా! అంత సంతోషం?'

'మనిద్దరం కలిసి అన్నంతిని ఎన్నాళ్లయింది? పెళ్ళిగాకో ఆ- పగలు ఆఫీసు-ఆదివారాలు నాకు పని తెములక ఎప్పుడూ విడివిడిగానే తినటం, నాకు నయించక పోవటం.'

'నీకు అంత ఇష్టమా అపర్ణా! నాతో కలిసి అన్నం తినటం?'

'.......................'

'నీకు హామీ ఇస్తున్నాను. రేపటి నుంచీ మనిద్దరం కలిసే భోం చేద్దాం-సరేనా?'

'మరినేనో నాన్నాలూ?'

'నువ్వా తిండిపుగానివిరా నాయనా. అబ్బ! ఏం కొడుకుని కన్నా వపర్ణా!'

అపర్ణ ముసిముసిగా నవ్వింది.

'ఒక్కపూట నేను వెళ్ళకపోతే ఫ్రెండ్స్ ఊరుకోరు. పైగా అక్కడ మజాగా, థ్రిల్లింగ్‌గా, హుషారుగా వుంటుంది. ఫ్రీగా వున్నట్లుంటుంది. అదో లైఫ్, నిజానికి నువ్వంటే నాకు భయం అపర్ణా! నీ నియమ నిష్ఠలకి నా విలాస జీవనం లొంగి పోతుంది. నీ వినయం ముందు, నీ ప్రేమ ముందు నా అహం, నా అజ్ఞానం ఓడిపోతై, అందరిలా నువ్వు మామూలుగా వుండు ప్లీజ్ అప్పుడు నాకు బాధ వుండదు సరే, ఇకైతే అన్నం తిందాం' అని ఆమె చెయ్యి పట్టుకుని వంటింట్లోకి తీసుకెళ్ళాడు రాజేంద్ర.

మురళికి మహావిచిత్రంగావుంది. తల్లి దండ్రులిద్దరి ఒళ్లో చేరి కాసేపూ అల్లరిచేసి తర్వాత డైనింగ్ టేబిల్ ఎక్కి చిందులేశాడు

అన్నంతిని తండ్రీ కొడుకు లిద్దరూ బయటి కొచ్చారు. అపర్ణ వంటిల్లు సర్దుకుంటున్నది.

"నాన్నాలూ! వాల్మీకిమి ఏం రాశాలు?"

వాల్మీకిమా? ఎవర్రా? ఆపేరెప్పుడూ వినలేదే" తలగోక్కున్నాడు తండ్రి.

తండ్రి కనిపెట్టలేక పోయినందుకు అతన్ని జాలిగా చూశాడు మురళి.

"పోన్లే-తెలిపోతే, నేచెపుతాలే"

"ఓకే!"

"లామాయణం లాశాలు. నవ్వుకూడా నాతోపాటే అమ్మ దగ్గిర తదువుకో అన్నీ చెపుతుంది"

"నాయినా! నీకు మీ అమ్మకూ ఒక నమస్కారం. అర్థమైనవన్నీ చెప్పి నిన్ను పాడుచేసింది చాలక నన్నూ........" అపర్ణ రావటం చూసి నోరు మూసేసుకున్నాడు రాజేంద్ర.

లక్షణంగా పెంచుకోండి బాబూ! ఔను-రోజూ సాయంత్రాలు బార్‌కి ఎత్తుకెళ్ళి అర్ధరాత్రి ఇంటికి తీసుకొస్తారా? పేకాట ఇత్యాదులు చక్కగా నేర్పుకుంటాడన్నమాట.'

ఇంతలో సుడిగాలిలా దూసుకు వచ్చాడు పుత్రరత్నం.

'నాన్నాలూ! నాకు గాలిపతం కావాలి.'

'ఓహో-అదొకటా? ఎవరు చెప్పార్రా తెమ్మని?'

'నా ఫ్రెన్ను మా లషిమి తెప్పిందిగా'

'బావుంది మా లక్ష్మి అంటే రమణారావుగారి అమ్మాయా? ఆ పిల్ల నీకు సలహాలు చెప్తుందా? గాలిపటం రేపు తెస్తాలే-ఏం?'

'ఉహూఁ నాకిప్పులే కావాలి.'

'అబ్బాయిగారి గారాబం వగం అణిగి పోతుందిలే! చెల్లాయి పుడితే.'

'తెల్లాయి అంటే ఏంతి నాన్నాలూ!'

'మీ అమ్మనడుగు'

'ఒక దప్పు కట్టుకు ఊరేగరాదూ తండ్రీ కొడుకులు'

'అంతకోపం దేనికోయ్-ఉన్నమాటంటే........'

మురళిని నిద్ర పుచ్చటానికి అవస్థ పడటం మొదలు పెట్టింది అపర్ణ.

'వాడు నిద్రపోనో అని గొడవ చేస్తుంటే అంత జతిమాలతావుగాని ఎదురుగుండావున్న నేను కనబడటం లేదూ అమ్మడూ!'

'మీరు-ఇవాళ వెళ్ళరా? ఇంట్లోనే వుంటారా? ఏమండీ నిజంగానా! ఇందాకట్నించీ అదే అనుకుంటున్నా-ఇంకా బయల్దేరరేదేమిటి అని'- ఆనందంతో ఆ వేగంతో ఆమె కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లినై.

రాజేంద్రకు ఇన్నాళ్ళ తన ప్రవర్తన మీదా ఏవగింపులాంటిది కలిగింది.



'తన ఇల్లాలు ఏం కోరరాని కోరిక కోరిందనీ ఇన్నాళ్ళూ మొండిగా పెడచెవిన పెట్టాడు. తరచుగా సాయంకాలాలు ఇంట్లో వుండమంది. కబుర్లు చెప్పుకుందాం. లేకపోతే ఎక్కడికైనా వెళదాం అంది. సాంసారికానందం దాంపత్య జీవిత మాధుర్యం అని నూరి పోసింది. చెడ్డ వాలవాట్లు మానమని తన కాళ్ళు పట్టుకుని బతిమాలుకుంది. నిర్లక్ష్యంగా వెళ్ళిపోయేవాడు తను. పాపం నన్ను కట్టుకున్నందుకు తన సరదాలన్నీ చంపుకుంది. పైగా ఏ మాత్రం విసుక్కోదు. ఎంత రాత్రి వేళ ఇంటికి వచ్చినా చిరునవ్వుతో అన్నం పెట్టింది.



'ఏమిటండీ? ఆలోచిస్తున్నారు?'



'ఏంలేదుగాని మరి జోలపాడి నిద్రపుచ్చాలమ్మా నన్ను.'

'ఏం పాడను? జో అచ్యుతానంద జో జో ముకుందా! లాలిపరమానంద లాలి రాజేంద్రా!'



అమాంతం ఆమె ఒళ్ళో తలపెట్టి పడుకోబోయాడు రాజేంద్ర.

'బలే-బలే-నాన్నాలు అమ్మఒళ్ళో పలుకున్నాలు' చప్పట్లు కొట్టాడు మురళి తన బుల్లి చేతులతో.

అసంకల్పిత ప్రతీకార చర్యలాగా స్ప్రింగ్ యాక్షన్ లాగా అంత వేగంతోనూ లేచి కూచున్నాడు రాజేంద్ర.

"ఒరేయ్! మీ అమ్మ సెకెండ్ షో కొస్తుందేమో అడగరా" అన్నాడు.

"కావ్వండి పసివాడితో అర్ధరాత్రి సినిమా ఏమిటి? చూడదలుచుకుంటే ఫస్ట్ షోలూ, మాటినీలూ లేవా? అని చెప్పరా అబ్బాయ్"

'అయితే రేపు ఫస్ట్‌షోకి వెల్దామని చెప్పరా.

"ఓ., వచ్చేప్పటికి రెడీ అయివుంటాం. మర్చిపోయి అట్నుంచి అటు వెళ్ళిపోయేరు గనక ఆశ పెట్టి మానెయ్యకూడదు."

'ప్రామిస్'

ఆమె చేతిలో చెయ్యివేసి గట్టిగా నొక్కి పట్టుకున్నాడు రాజేంద్ర.

ఇందాకట్నుంచీ వచ్చేస్తున్న మురళి కోపం ఇప్పుడు తారస్థాయినందుకుంది. రోజూ క్షణమైనా తనను విడవకుండా అవీ ఇవీ చెప్పి, ఈ పాటికి తనను దగ్గిర పెట్టుకుని పడుకునేది అమ్మ. ఏమైందివాళ నాన్నతో మాట్లాడుతూ తనను పట్టించుకోవట్లేదు. ఛీ, నాన్న వుండక పోతేనే బావుంది. ఆ పిల్లవాడి చిన్ని బుర్రలో ఇలాంటి ఆలోచన. కాళ్ళు టప టప కొట్టుకుంటూ వాడి మంచం దగ్గిరికి వెళ్ళిపోయినాడు.

"అరె, వీడికి కోపమొచ్చిందండీ' అంటూ వాడి మంచం మీద కూచుని చిచ్చి కొట్టటం ప్రారంభించింది.

'ఏం కొడుకు! ఏం తల్లి? ఆ పసి వెధవకీ ఈ తల్లికీ ఎలాంటి స్నేహం!' విస్మితుడై పోయినాడు రాజేంద్ర.

వాడేదో గునుస్తున్నాడు. ఈవిడేదో ఓదారుస్తున్నది.

'ఓయ్, అపర్ణా! ఇంకా ఎంత సేపు?'

'ఇస్, మాట్లాడకండి, నిద్రపోయినవాడు లేస్తాడు'

'బావుంది. ఇంట్లో వుండు, ఉండు అని వేపుకుతిన్నావు. ఉన్నందుకిదా ప్రతిఫలం.' రుసరుస లాడాడు రాజేంద్ర.

కొడుకుని సరిగా పడుకోబెట్టి, దుప్పటి కప్పి ఇవతలికి వచ్చింది అపర్ణ. 'ముప్పయేళ్ళొచ్చిన మీకు జెంసీనే, మూడేళ్ళు వచ్చిన మీ కుమారుడికీ జెంసీనే. నా దుంప తెగిపోతున్నది మధ్యన' అంటూ.

+ + +

పెందలాడే నిద్రలేచాడు రాజేంద్ర. శరీరం తేలికగా, ఖులాసాగా వున్నట్లుంది. రాత్రి ఏం తీసుకోకుండా ఇంట్లో వున్న ఫలితం అదుగడుగునా కన్పించింది.

భార్యతో కలిసి సరదాగా కాఫీ తాగుతుంటే ఎంతో ఉత్సాహంగా వుందనికి. తాగుతున్న పాలగ్లాసు వదిలేసి తండ్రి మీది కెక్కి జుట్టు పీకెయ్యటం మొదలు పెట్టాడు మురళి.

'ఒరే, ఒరే, ఏమిటి నాన్నా! ఏమైందిరా?' అంటూ విడిపించుకొనే ప్రయత్నం చేస్తున్నాడు రాజేంద్ర.

బాబూ! నాన్నారినలా ఏడిపిస్తే ఎలాగరా? అసలే ఆ తలకాయకి సర్వౌషధాలు నైవేద్యం పెట్టి ఎలాగోలా కాపాడుకొస్తున్నారు గదా. ఇప్పుడు నువ్విలా దాడిచేస్తే బట్టతలై పోతుందిరా పాపం' అంటూ వాణ్ణి బలవంతాన ఎత్తుకుంది అపర్ణ-ఉక్రోషంగా చూస్తున్న భర్తను, 'వ్వేవ్వేవ్వే' అని ఎక్కిరించి.

'నాన్నాలూ! నువు ఆఫీసు కెళ్ళిపో' అన్నాడు మురళి.

వాణ్ని చూసి ఆపుకోలేని ముద్దైంది కన్న తండ్రికి.

'జెలసీ మహానుభావా! జెలసీ! చెప్పాగా అన్నీ మీ బుద్ధులేనని' కొంటెగా నవ్వింది అపర్ణ.

+ + +

రాజేంద్ర ఆఫీసు నించి ఇంటికి రాగానే సంతోషంగా కాఫీ తెచ్చింది అపర్ణ. మురళి నిండు ముస్తాబులో ఎదురొచ్చాడు.

'ఏమిటి విశేషం? తల్లీ కొడుకూ ఎక్కడికో బయల్దేరి నట్టున్నారు?'

చిన్నబోయిన మొహం భర్త కంట బడకుండా గబుక్కున లోపలి కెళ్లిపోయింది అపర్ణ

'మరి నాన్నాలూ సినిమాలో పెద్దపెద్ద ఏనుగులూ, పులులూ, సింహాలూ అన్నీ వుంతయ్యని చెప్పింది మాలతిమి. మనని తినేయవూ?' అదుర్దాగా అడిగాడు మురళి.

'సినిమానా? ఏ సినిమా?' అప్పుడు గుర్తొచ్చిందతనికి. సినిమాకి తీసుకెళతానన్న విషయం- గుండెల్లో రాయి పడినట్లయింది.

మళ్ళీ వచ్చింది అపర్ణ.

'పిచ్చివాళ్ళంరా తండ్రీ మనం, మీ నాన్నకు సినిమా సంగతి గుర్తు లేదు, మనసం పెట్టి పుట్టలేదు. దా, ఆ బట్టలు విప్పేసి మామూలువి వేసుకుందువు గాని' అన్నది.

'ఇవాళ బయటికెళ్ళి డ్రింక్ పుచ్చుకోనిది బతకలేను' అని నిశ్చయించుకుని ఇంటికొచ్చిన రాజేంద్రకు ఉద్రేకం కలిగింది,

'అక్కర్లేదపర్ణా! పద. మనం సినిమా కెళదాం' అన్నాడు.

+ + +

ఆ మర్నాడు స్నేహితులంతా ఆఫీసుకొచ్చి పడ్డారు. రాజేంద్ర వరసగా రెండురోజులు రావటం మానేశాడంటే వండరే కదా. వాళ్ళకోసం డబ్బు ఖర్చు పెట్టేవాడు అతను రాకపోతే వాళ్ళకు చాలా నష్టం, కష్టం. ఇంటిలో భార్య తన సర్వశక్తులూ వినియోగించి అతన్ని మంచి మార్గం లోకి తిప్పటానికి ప్రయత్నిస్తుంటే, వీళ్ళు అంతకు యాభై రెట్లు పాత మార్గంలోనే స్థిరపడి పోయేట్లు కృషి చేస్తుంటారు. అపర్ణ అదది ఒక్కర్తి. వాళ్ళు సుమారు ఎనమండుగురుంటారు. మంచికంటే మనిషికి చెడు ఆకర్ష ణీయంగా కన్పిస్తుంది దుష్టశక్తి కున్న ప్రోద్బలం. ప్రోత్సాహం మంచి కెప్పుడూ వుండదు ప్రపంచంలో. కాకపోతే ఓర్పుతో, కూరిమితో అహో రాత్రాలూ అదే పనిగా కృషిచేస్తే చివరికి మంచి జయిస్తుంది. జయించి తీరుతుంది. అయితే అంతకాలం కృషి చెయ్యటం ఎంత కష్టం.

'ఏమోయ్- రాజేంద్ర శేఖర్. మా మీద శీత కన్నేశావు' అన్నా డొకడు.

'ఛా మనవాడు అలా ఎప్పటికీ చెయ్యడు. ఇంటిలో చికాకుల వల్లో ఒంటిలో బాగుండకో రాలేదుకదూ బ్రదర్' అని ఒక స్నేహితుడు.

'ఏమోనోయ్ నువ్వు రాకపోతే బోసిగా వుంది. నాయకుడు లేని ముఠా వుంటుందా! ఇవాళ వీరేందర్ పార్టీ ఇస్తున్నాడు వస్తున్నావుగా' అని ఒక మిత్రుడు.

'రాకేం చేస్తాడు నీ పిచ్చిగాని. మన రాజేమన్నా ముక్కు మూసు కునే మునిలాంటివాడా?' అని ఒకడు-

'కొంపదీసి శ్రీమతిగారు వద్దనలేదు గదా' అని ఒకడు.

'ఛా ఆవిడ గ్రాడ్యుయేట్ కల్చర్ తెలిసి పల్లెటూరి గబ్బిలాయి కాదు ఇంకా ప్రోత్సహిస్తుండవచ్చు: బ్రాడ్ మైండెడ్‌గా' అని ఒకడు.

'అయినా మటుకు మన పెళ్ళాల నోరు మూయించి సర్వీకారంగా మనం వచ్చెయ్యటంలా? మనకేమోయ్. మగవాళ్ళం. ధీరోదాత్తులం హాయిగా తిరిగే హక్కు మనకుంది ఈ ఆడవాళ్ళ మాటలు విని అందమైన సాయంకాలాలు ఇంట్లో కూచుంటామా? నాన్సెన్స్ ఆడోళ్ళంటే ఎవరు అసలు? ఇంట్లో పని చేసి పెట్టి పిల్లల్ని కని, ముసలితనంలో సాయంగా వుండటానికి గాని ....'

చివాల్న లేచాడు రాజేంద్ర. స్నేహితుల మాటల్తో జుగుప్స కలిగింది. కానీ తనను చేతకాని వాడికింద కట్టేశారే అన్న బాధ వుంది వెళ్ళి వాళ్ళతో ఎంజాయ్ చెయ్యాలన్న బలవత్తరమైన కాంక్ష కూడా వుంది అతను నలిగిపోసాగాడు. ఈ భావాలన్నిటి మధ్యనాపడి ఒకవైపు నిన్న సాయంత్రం. రాత్రి తను గడిపిన మృదుమధురమైన పవిత్రమైన కుటుంబ జీవనం గుర్తొస్తున్నది. మళ్ళీ అంతలోనే తన స్నేహితుల మాటలు.

'ఛీ, భార్యా పిల్లలు తనని బంధించి వేశారు. హుఁ మోసపోయి నాడు తను- ఇంక ఆ ఆటలేం సాగవు' కోపంగా అనుకుంటూ ఇంటి కొచ్చాడు.

అపర్ణ ఏదో నేర్పుతున్నది. కుర్రవాడు నేర్చుకుంటున్నాడు బాసీ పెట్టు వేసుకుని. వాడి శ్రద్ధా, నైర్మల్యమూ ఆ పితృహృదయాన్ని కలచి వేసినై. భార్య శ్రావ్య కంఠాన్ని కొడుకు తొక్కు పల్కులను వింటూ మైమరచిపోయాడు.

'ఒరె మీరొచ్చి ఎంతసేపైంది? ఇదేమిటిలా నిశ్శబ్దంగా వచ్చి తమాషాలు చేస్తున్నారీమధ్య కాఫీ తెస్తా. ఈ లోపల ఇవాళ్టి ప్రోగ్రాం ఏమిటో తండ్రి కొడుకులు నిర్ణయించండి.' అంటూ లోపలికెళ్ళింది అపర్ణ.

ఒకసారి గతుక్కుమని సర్దుకుని కొడుకుని పలకరించి చుట్టూవున్న పుస్తకాల్ని చూశాడు రాజేంద్ర.

కృష్ణ శతకం, ప్రహ్లాద చరిత్ర, ఇంకా ఇలాంటివే కొన్ని పుస్తకాలు, బాలగేయాలు, పాటలు, కథలు బొమ్మల పుస్తకాలూ.

'అపర్ణా!'

కాఫీ కప్పుతో పరిగెత్తు కొచ్చిందామె.

'ఏమిటివి?'

'పు......స్తకాలు' భయపడుతూ చెప్పింది.

"ఎవరికోసం కొన్నావు? మీ నాయనమ్మ కోసమా ఈ పక్కన పెట్టిన పుస్తకాలు?"

కాదండీ-వాడికిప్పుడైతే నాలిక తిరుగుతుందని స్కూల్లో జేరితే ఇంక వీటికి టైముండదు. వాడి లేత మనసుకి కష్టం కలగకుండానే చెప్తున్నానండీ-వీటితో వాటికి శాస్త్ర పరిచయం కల్గించటమే నా ఉద్దేశం-లేత వయసులో ముద్రపడిన విషయాలు జీవితాంతమూ చెడవని......' కొంచెం మంచిగా బతుకుతాడని తల్లిగా నేను చేయవలసినది చేద్దామని....!

'నోర్ముయ్ పాతచింతకాయ ఒపీనియన్సూ నువ్వూనూ, వాణ్ని పాడుచేస్తున్నావ్—నేనేమో ఫారిన్ రిటర్న్డ్ ఇంజనీరునా? నా బిడ్డ నిలా సన్యాసిని చేస్తావా? నేనెంత చెప్పినా నన్ను కేర్ చెయ్యవు గదూ?'

'నేనేం చేశానండీ?' అపర్ణ కళ్ళల్లో నీళ్ళు.

'ఇంకేం చెయ్యాలి? దేశభక్తి పిచ్చివాడి బుర్రకెక్కిస్తున్నావ్-కాన్వెంట్‌లో చేర్పించాలనుకుంటుంటే సంస్కృత శబ్దాలు చెప్తున్నావ్-ఇది ఏకాలమనుకుంటున్నావు?' రౌద్రంగా అడిగాడు రాజేంద్ర.

'ఏ కాలమైనా మనిషి నీతిగా బతకడంలో తప్పులేదు- వాడు బాగు పడాలనీ, పేరు తెచ్చుకోవాలనీ తాపత్రయపడ్డాను- పుట్టిన దేశం- వంశం, మహాత్ములు, కవులు, వీరులు- ఇవి చెప్పటం కూడా దోషమే అయితే ...' కళ్ళవెంట నీళ్ళు జలజల రాలాయి అపర్ణకి.

ఆమె దుఃఖాన్ని అతను భరించలేకపోయినాడు. ఏదో కారణం వెతికి ఆమె మనసు నొప్పించి, ఆ అదనులో బయటి కెళ్ళిపోవాలని ప్లాను వేశాడు. కాని- మరీ ఇలా అవుతుందనుకోలేదు.

'ఆమోరిందావులే- మాటకు ముందు ఆ ఏడుపెందుకు? నేనేమ న్నాను?'

కళ్ళు తుడుచుకుంది అపర్ణ.

'మీకు అమితమైన పాశ్చాత్య వ్యామోహం వున్నదని నాకుతెలుసు అప్టుడేట్‌గా విలాసంగా తయారై రోజూ మీతో బయటికి రానని అసం తృప్తి వుందనుకుంటూ పిల్లవాడిని మీ ఇష్టప్రకారం పెంచలేక పోయి నాను- నియమబద్ధంగా నిరాడంబరంగా వున్నప్పుడుండే కాంతి ఆడం బరంగా విచ్చలవిడిగా వున్నప్పుడు వుండదు అని నా ఉద్దేశం. మనిద్దరి దృక్పథాలు విభిన్నమైనవి. చెయ్యీ చెయ్యీ పట్టుకుని ఒకే బాటలో నడవ వలసిన మనిద్దరం రెండు మార్గాల్లో వెళుతున్నాం. ఎప్పటికైనా మనం కలిసి నడుస్తామా? ఆ శుభ ఘడియ నా జీవితంలో ఎన్నడైనా వస్తుందా?

ఎప్పట్నించో అణచుకున్న ఆవేదన ఉప్పొంగిరాగా గబగబా అనేసి కింద కూలబడిపోయింది.

అంతవరకూ బిక్కమొహంతో నుంచున్న మురళికి ఏడుపొచ్చే సింది. విషయం ఏం తెలీకపోయినా తన పుస్తకాల మీద తండ్రికి కోపం వచ్చిందని మటుకు తెలిసింది.

అపర్ణ భుజం మీద చెయ్యేసి 'అమ్మా! ఏడవకు- ఆ పుస్తకాలు పారేద్దాం. నాన్నాలు అప్పులు ఏం అనలు' అన్నాడు

'ఔన్రా, నాన్నే పెద్దవాడు, అన్నిటికి అమ్మే మంచిది. దేవత ఒరే మీ అంతర్యాలు నాకు చెప్పరు, చెప్పినా నాకు అర్థమయ్యేట్టు చెప్పరు. నేనేం మీలా అంత తెలివైన వాడినా? తాగుబోతుని, జూదరిని కదా. మంచితనం, లాలనా అనే వసలు తెలీవు గదా...'

గబుక్కున వచ్చి అతని నోరు మూసేసి 'ఇక చాలు రాజా! అలా మాట్లాడకు. నేను నీదాన్ని. నీ ఇష్టమైనట్టు ప్రవర్తిస్తాను. సరేనా' అన్నది ఇప్పొంగిన అభిమానంతో అపర్ణ. అంతకంటే ఉప్పొంగిన అభిమానంతో చిలిపిగా అడిగాడతను.

'సరే- ఒప్పుకున్నాను. మరిప్పుడు నాతో వస్తావా? అలాఅలా... తీరా అక్కడికొచ్చి నలుగురి ముందూ మడి కట్టుకుని కూర్చోకూడదు. సరదాగా తిని తిరిగి ...'

'తాగాలి- ఆగిపోతారేం? అలాగే వస్తాను. నా మనవి మీరెలాగూ ఆలకించరు, నా మార్గంలోకి మీరు మళ్ళరు, మీ మార్గంలోకి నేనే వస్తాను. మంచో చెడో ఇద్దరం ఒకలాంటి బతుకే బతుకుదాం. చెడులోంచి మంచికి రావటం కూడా అంత కష్టమే.... అయినా నా సంసారం కోసం మారతాను. సారీ! ఇంకెప్పుడూ మంచి చెడుల గురించి ఏమీ అనను. ఏం? ఈ ఒక్కసారికి క్షమించండి-' అంటూ లోపలికి పోబోయింది.

'చాల్చాలు గాని ఇలా రా అమ్మడూ! లోపలికెళ్ళి ఆధునికంగా తయారై వస్తావు గదూ?' అని పిల్చాడతను.

'అవును ఒక్క క్షణం'

'అపర్ణా! వద్దు. నా కోసం నువ్వు మారిపోనక్కర్లేదు- నీ కోసం నేను మారిపోతున్నాను నేను నోటితో చెపుతుంటే నీకు నమ్మశక్యంగా లేదు గదూ? ఎందుకంటే ఎప్పటికప్పుడు మారిపోతాను, మారిపోతాను అంటూ అనుకుంటూ నిన్ను మోసం చేశాను. నన్ను మోసం చేసుకున్నాను. ఇంక అలా చెయ్యను నా ప్రవర్తనను బట్టి నువ్వే గ్రహిద్దువు. గాని ఇదుగో ఒట్టు నా పాత జీవితానికి తిలోదకాలిస్తున్నాను. ఇవాళ్టి నుంచీ నా బ్రతుకు నా భార్య కోసమూ, నా బాబు కోసమూను' అంటూ ఆమె చేతిలో చెయ్యి వేశాడు రాజేంద్ర. 

అపర్ణ కళ్ళు తళతళలాడేయి. 

'మరి నా బ్రతుకు ఎవరి కోసమనుకున్నారు? నా భర్త కోసమూ, నా బాబుకోసమూను' అన్నది పరవశంగా.



తన భర్త మారిపోతాననటం ఆమెకింకా నమ్మశక్యంగా లేదు. మధురమైన కలకంటున్నట్లు వుంది. కాని ఆ మాటలు చెప్తున్నపుడు అతని మొహంలోని దృఢ నిశ్చయం. ఉచ్చారణలో వ్యక్తమైన పట్టుదలా 'కలకాదు నిజమే'నని చెప్తున్నాయి. తృప్తిగా నిట్టూర్చిందామె.

అప్పుడు రాజేంద్ర ఇలా అన్నాడు.

'వెరసి తేలిందేమిటంటే నీ బ్రతుకు నా కోసం. నా బ్రతుకు నీ కోసం. మనిద్దరి బ్రతుకూ బాబుకోసం—'

